

ఎ. వి. ఎం. వారి "పుట్టినిల్లు-మెట్టినిల్లు" లో కృష్ణ, చంద్రకళ.

జూలై
**12**
విడుదల!

ఏ.వి.యమ్. ప్రొడక్షన్స్

# పుట్టినిల్లు మెట్టినిల్లు

మహోన్నతమైన
ఉత్తమ కుటుంబ చిత్రం

దర్శకత్వం:
పట్టు

మాటలు:
ఎన్.ఆర్.నంది

సంగీతం:
సత్యం

విజయా రిలీజ్ VIJAYA



# ఉత్తరాలు

## ప్రత్యేకరాష్ట్ర సమస్య

దాదాపు ఎనిమిది మాసాలక్రితం ప్రారంభమైన ఆంధ్రసమస్య యిప్పటిదాకా ఒకకొలిక్కి రాలేదంటే విస్మయం, విభ్రాంతి కలగక పోవుమరి. ముల్కీసమస్యతో ప్రారంభమైన ఈ సంక్షోభం విషమ పరిస్థితులలో ప్రత్యేక రాష్ట్రఉద్యమంగా రూపొందింది, తెలుగువాళ్ల మంచితనాన్ని, గౌరవప్రతిష్ఠలను ఇంతవరకు దిగజార్చింది. యిది ఎప్పుడో 1969లో నాయకుల అసమర్థతకు నాందిగా ఏదో తప్పు ఒప్పుకునే మనస్తత్వంతో వ్యవహరించి వేసిన తప్పటడుగు, నాలుగు కోట్ల తెలుగు ప్రజలమధ్య లేనిపోని అపోహలను, ఆవేశకావేశాలను పెంచింది. అప్పుడే ఈ సమస్యకు ఒక ఖచ్చితమైన పరిష్కారమార్గం కనుగొని ఉంటే ఈనాడు ఈ సమస్య యింత జటిలంగాక పోయి, ఉద్రిక్త పరిస్థితి ఏర్పడక పోయి కొన్ని అమాయకప్రాణాలు ఆహుతి కాకుండా ఉండేవి. ఈ సమస్యను ఒక రాజకీయ తగువుగా పరిష్కరించాలని అనుకున్న కేంద్ర నిర్ణయం ఈనాడు అపహాస్యం పాలైంది. మొన్నటి మంత్రివర్గం తప్పనిసరిగా రాజీనామ సమర్పణలో నిర్ణయం ఏమైనప్పటికి రాష్ట్రపతిపాలనతో సమస్యను ఒక కొలిక్కి తేవడానికి శాంతిభద్రతల పరిరక్షణకు దోహదకారి అవుతుందనిన కేంద్రం నాయకులు, మామూలు ప్రశాంతత ఏర్పడినను స్వచ్ఛమైన స్పష్టమైన సంప్రదింపులు జరపలేదు. ఒకటి గుర్తుంచుకుంటే రాష్ట్రపతిపాలనలోనే త్వరత్వరగా సాంఘిక కార్యక్రమాలు. హరిజన, గిరిజనోద్ధరణ, క్షామనివారణ సహాయ కార్యక్రమాలు ఎప్పుడూ లేనంత చురుకుగా, చొరవగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేపట్టింది. విస్తృతంగా చేపట్టిన ఈ కార్యక్రమాలు యింత త్వరలో సాగడం మంత్రివర్గం ఉంటే సాధ్యమా? అనే విషయం పరిశీలకుల దృష్టికి రాకపోదు. స్వార్థాన్ని స్వప్రయోజనాలను హద్దులు కోలేక ఈమధ్య కొందరు నాయకులు రాష్ట్రపతిపాలన రద్దు చేయాలనే కోరడం తప్పించి రాష్ట్ర పురోభివృద్ధికి చిత్తశుద్ధితో పాటుపడే ఉద్దేశ్యం మాత్రం కాదు. యిక ఈ సమస్య పరిశీలించుకుంటే కేంద్రం ఉద్యమం ప్రారంభం నాటినుండి నేటివరకు రాయబారాలు అప్పుడప్పుడు పంపుతూనే ఉంది. పంపిన రాయబారాలు సరాసరి రాజధానికి రావడం, వారు నీరు; అని కాకుండా అందరితో మంతనాలు జరిపి హస్తినాపురం చేరేముందు 'మీరు— మీరు ఒకనిర్ణయానికి రావడం తప్పించి యిక వేరే మార్గాంతరం లేదని' చెప్పడం పరిపాటి. ఈలాగే కడసారిగా ఈవిషయంపై శ్రీ పంత్ చెప్పినమాట కేంద్రం స్పష్టమైన వైఖరి ఏమిటో అవగతం కాదు. పోనీ ఆంధ్ర, తెలంగాణా ఎమ్. ఎల్. ఏ. లు ఒకచోట చేరి సరైన, సహేతుకమైన నిర్ణయం తీసుకుని 'యిదిగో యిది మా అభిప్రాయం. యిది ప్రజల అభిప్రాయం' అని కేంద్రానికి ఎరుకపరచవలసిన బాధ్యత వారి భుజస్కంధాలపైన ఉంది. కాని దురదృష్టవశాత్తు ప్రజలచే ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులు ఏదో ఒక కూటమిలో చేరి తమ స్పష్టమైన వైఖరిని అవలంబించలేక, బాధపడిపోతూ ఎన్నుకున్న ప్రజల ఆగ్రహానికి గురి అయ్యారు. ప్రజల మంచి చెడ్డలను కూడా ఆలోచించలేని అమాయకులని ప్రజల్లో నమ్మకం ప్రబలిపోయింది. ఈమధ్య తెలంగాణా ప్రముఖనాయకులు షరతులు లేని సమైక్య రాష్ట్రాన్ని కోరడం ఆనందించవలసిన విషయం. అటూ యిటూ కూడా 'విడిపోదాం' అని కొందరు, —'కలసిఉందాం' అని మరికొందరు కోరుతుంటే ఎటుతెలియని కేంద్రం కార్యక్రమం ఏమిటో అర్థం కావడం లేదు. ప్రత్యేక రక్షణలు, అదేతరహా సదుపాయాలు ఒక రాష్ట్రంలో ఒక ప్రాంతం వారికి కల్పించిన మిగిలిన ప్రాంతం వారికి కంటక ప్రాయం కాక తప్పదుమరి. రాష్ట్రం ప్రతి పౌరుడు ఒకేమాదిరి రక్షణలు హక్కులు ఉండాలి. హైదరాబాద్ ఒక్కటే స్వేచ్ఛా మండలంగా ప్రకటించినంత మాత్రాన, ఈ సమస్య సంపూర్ణ పరిష్కారానికి దోహదం కాదు. యిప్పటికే ఎంతో ఆలస్యమైనా, యిరుప్రాంతాల ప్రజలకు ఆమోద యోగ్యమైన ఒక నిర్ణయాన్ని కేంద్రం శీఘ్రగతిని ప్రతిపాదించాలి. అప్పుడే ఈ సమస్యకు తుది రూపం చేకూరగలదు.

—కె. వి. వి. బ్రహ్మానందరావు, విశాఖపట్నం.

## అజిత్‌సింగ్ జిందాబాద్

సూర్యచంద్రాదులు గతులు తప్పినా ఆశ్చర్యపడేవాడిని కాదు. నీటికోసం నల్లా దగ్గిర, కిరోసిన్ కోసం నడిరోడ్డులో, రేషన్ బియ్యంకోసం వంతుల వారిగా మా యావిడనీ, మా అబ్బాయినీ షాపు ముందు వరుసలో— గంటల తరబడి, తిండీతిప్పలు మాని, కాళ్లు లాక్కుపోయేట్టు నిలబడ్డాను— ఇంతగా దిగజారి పోయిన మన జీవితాల్ని తలుచుకుని కించిత్తు సహితం ఆశ్చర్యపడలేదంటే నమ్మండి. కాని, ఇప్పుడు . . .? బస్సుల్లో, అందులోనూ సిటీ బస్సుల్లో ప్రయాణికుల నమ్రతలు, విధేయతలు చూసి కొయ్యబారి పోయాను. నేను వాళ్లని చేరిచేరక మునుపే డబ్బులు — పైగా 'టికెట్‌కి సరిపోయే అంత' చిల్లర డబ్బులు చేతిలో పెట్టి టికెట్‌కోసం చేతులు చాపుతున్నారు. 'టికెట్ కటాయించారా?' అనడిగితే వెకిలి నవ్వులు నవ్వే ఈ ప్రయాణికులేనా ఈనాడు టికెట్లకోసం ఇంత ఆరాటపడుతున్నారు? నాకుమటుకు నాకు నమ్మకం కుదర లేదు. ఇది ఎలా జరిగింది . . .? ఎక్కడ జరిగింది?? ఎందుకు జరిగింది?

ఈ విషయం ఒక తెలిసిన ప్రయాణికుడ్ని అడిగాను.

'ముందు నాకు టికెట్ ఇవ్వు . . . తరువాత చెబుతాను—' అన్నాడు ఆత్రంగా.

పది పైసలు చేతిలోపెట్టి 'కరువు కాలంలో టికెట్లెందుకయ్యా. మేము బ్రతకాలా, లేదా—' అంటూ ఒక వెకిలి నవ్వు నా ముఖాన పారేసి దిగిపోయే ఈయన కూడా ఈనాడు టికెట్‌కోసం అల్లాడు తున్నాడంటే—

ఆయనిచ్చిన ఇరవై పైసలు తీసుకుని టికెట్ 'కటాయించాను.'

ఏమిటి విశేషం? అన్నట్టుగా ఆయన ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాను.

'అజిత్‌సింగ్ వచ్చాడుగదండీ!' అన్నాడు టికెట్‌ని కళ్లకద్దుకుని జేబులో దోపుకుంటూ.

నా సందేహం తీరిపోయింది. ఆయన సమాధానం నా మనసుకి రిలీఫ్ నిచ్చింది. హమ్మయ్యా— అనుకుంటూ పెద్ద నిట్టూర్పు నొకదాన్ని వదిలాను.

ఎన్నాళ్లకి చూశాను ఈ పరివర్తనా పరిజ్ఞానం!

సంచార న్యాయస్థానాలు వచ్చాయి.

ప్రయాణికుల్లో సంచలనం లేవదీశాయి.

టికెట్ 'కటాయించక'పోతే ఇప్పుడు బాధ్యుడు కండక్టర్ కాదు.

టికెట్ లేకుండా ప్రయాణం చేస్తున్న ఆ ప్రయాణికుడే బాధ్యుడు.

తమ దాకా వచ్చేవరకూ తెలియ దంటారు.

ఇక్కడ కూడా అదే జరిగింది.

టికెట్ ఇవ్వకపోతే (తీసుకోపోతే) మనదేం పోయింది. కండక్టర్ నోట్లో మట్టి పడుతుంది. మనకి పది పైసలు మిగులు తున్నాయి.—— అనుకుంటూ ఇంతకాలం గడిపిన (కొందరు) ప్రయాణి

# సంపూర్ణమైన నోటి రక్షణ



ఒక్క బినాకా టాప్ మాత్రమే మీకు సంపూర్ణమైన నోటి రక్షణ నిస్తుంది. ఎందుచేతనంటే బినాకా టాప్‌లో మాత్రమే మీ నోటిలో అన్ని మూలలకు చొచ్చుకొని పోగల ఒక ప్రత్యేక పదార్థమున్నది. దంతక్షయ కారకములైన సూక్ష్మ జీవులను నిర్మూలిస్తుంది. దుర్వాసనను తొలగిస్తుంది. సంపూర్ణమైన నోటిరక్షణ తప్ప మరొక దానికి ఒప్పుకోకండి.

---

**మీకు మీరుగా చూడగల నిదర్శనం ఇదిగో! ఈ లేబొరేటరీ ప్రయోగాన్ని మీ ఇంటిలోనే ప్రయత్నించండి; నేడే!**

---

ఒక గాజు గిన్నెను తీసుకుని అందులో నీరు పోయండి. ఆ నీటిలో పొడి చేసిన బొగ్గు లేక రంగు పొడరును చిలకరించండి.

బినాకా టాప్‌ను కొంచము నీటిలో కలిపి ఈ ద్రావకము యొక్క ఒక బొట్టును గాజు గిన్నె మధ్యలో వెయ్యండి.

మీ మటుకు మీరే చూడండి, ఎంత వేగంగా బినాకా టాప్ అన్ని వైపులకు వ్యాపిస్తుందో ...మలినమును విడగొట్టి, స్వచ్ఛమైన, తేటమైన ఉపరితలాన్ని కల్పిస్తుందో!

---




## బినాకా® టాప్

గుండ్రని కుంచె-చివళ్ళు కల్గిన బినాకా టూత్ బ్రష్ చిగుళ్ళను చీరదు.

mcm/ct/22 tel

కులు ఇప్పుడు ఎందుకలా మారారు?

ఫుట్‌బోర్డుల మీద కమ్మీలని పట్టుకుని వ్రేలాడుతూ స్టేజీల తరబడి ప్రయాణం చేసే ఆ గుంపులు ఇప్పుడు చెదిరి పోయాయెందుకు? ఇంతకి మునుపు 'వెహికిల్ ఇన్స్‌పెక్టర్' చలాన్ చేస్తే డ్రైవర్ నోట్లో మట్టి పడేది. ఇప్పుడు అలాకాదు. ఫుట్‌బోర్డుల మీద ప్రయాణం చేసే (పెద్ద) మనుషుల్ని మెడలు వంచి తీసుకెళ్లి పంచార వ్యాయస్థానాల్లో విచారణ జరుపుతున్నారు.

'టికెట్ ఇష్యూస్ కంప్లీటింగ్ పాయింట్స్' దగ్గిర ఏకధాటిగా బస్సుని కదల్చమని గంటలు కొట్టే ఆకతాయి మూకల చేతులు పైకి లేవడం లేదెందుకు? కండక్టర్ ప్రశాంతంగా టికెట్లన్నీ ఇచ్చేవరకూ లేనిపోని వోపిక చూపుతున్నారెందుకు? ఆఫీసుకు పది నిముషాలు ఆలశ్యం అయినా ఫరవా లేదు, పెళ్లి ముహూర్తం దాటిపోయినా ఫరవా లేదు, ఈ రైలుకి కాకపోతే మరో రైలుకి వెళ్ళొచ్చులే— అని ఎందుకు సరిపుచ్చు కుంటున్నారు?

ఇన్ని ప్రశ్నలకీ సమాధానం పైనే పేర్కొన్నాను.

తమదాకా వచ్చేవరకూ తెలవదంటారు— అని.

**ఉపశృతి**

ఇది వ్రాయడానికి ప్రోత్సహించిన 29.6.73 హైదరాబాద్— నోట్‌బుక్ శ్రీ తిరుమల రామచంద్రగార్కి ధన్యవాదాలు.

జై అజిత్ సింగ్.
పందిటి రాంబాబు, కండక్టర్, కూకట్‌పల్లి డిపో.,
(హైదరాబాద్)

## ఉత్తరాలు

నాడు ఈనాడు ప్రాంతీయ, కుల తత్వ వాదుల చేతులలో ప్రగ్గిపోతున్నది.

"తెలుగు వాళ్లకు కావలసింది మోహన్ మీద ద్వేషం కాదు, మోహన్ లాంటి ఎంతోమంది మేధావులు తెలుగునాడులో ఉదయించాలని."

రామారావు, (చిరునోముల)

### ముఖచిత్రం

29—6—73 వ నాటి ఆంధ్రసచిత్రవార పత్రిక అట్టమీది, 'విజయ,గిరిబాబుల' ముఖచిత్రం ఆకర్షణీయంగా ఉండి అమితానందాన్ని కలిగించింది.

—పి. పాండయ్య (హైదరాబాదు)

* * *

ఈవారం (29.6.73) నాటి 'విజయ—గిరిబాబు'ల ముఖచిత్రంతో ముచ్చటగా వెలువడిన 'ఆంధ్రసచిత్ర వారపత్రిక' చాలా ఆకర్షణీయంగా వుంది.

'ప్రజాప్రతినిధులా?' వ్యాసం ప్రస్తుత ఆంధ్ర తెలంగాణ వేర్పాటు సమస్యలకు అనుగుణంగావుంది. శ్రీమతి ఇందిరాగాంధి 1972వ సం.లో సృష్టించిన 'పంచసూత్రపథకం' కొంతవరకు మేలుకరంగావున్న పదిమందికీ నచ్చకపోవడం ఆ పథకాన్ని దూరంచేశారు కదా! మరి 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరణకి పీలు కలిపించిన పెద్దమనుష్యుల ఒప్పందం కూడా త్రోసిపుచ్చటం జరిగినందువలన ఈ ఆంధ్ర—తెలంగాణ సమస్య ఈలాగే ఇప్పుడప్పుడే పరిష్కార మార్గం దొరకబోదని వ్యక్తమగుచున్నది. ఇకదీనికి 'గమ్యం' ఎలా వుంటుందోనని ప్రజలంతా ఎదురు చూస్తూ కూర్చోవటం తప్పక పోదుమరి...

ముఖ్యంగా ఈ మధ్య పత్రికలోని ఉత్తరాలశీర్షికలో పాఠకులు కొందరు ప్రాంతీయ అభిమానాన్ని దృష్టిలో పెట్టుకుని వారి ప్రాంతానికి చాలవరకు లోటు పాట్లు జరిగినాయని వ్రాయకపోతే,వారికి తోచిన రీతిగా ఈ సమస్యకు పరిష్కారమార్గమును ఇరుపక్షాలవారికి న్యాయసమ్మతంగా ఉండేటట్లుగా వ్రాస్తే కొంత వరకు మేలు జరగవచ్చు నేమో యని ఆశిస్తున్నాము.

రామరాజు వేంకటేశ్వరరావు,
అక్కిరాజు విజయ కుమార్,
రామగిరి కాలనీ, (నల్లగొండ)

### కార్టూన్

22—6—73 వారపత్రికలో నాకు ఉత్తరం వ్రాయగల అంతగా ఉద్రేకపర్చింది, 54వపేజీలో శ్రీ బాబుగారి కార్టూను. నవ్వుకొని కాలక్షేపం చేస్తానికి అయినా అకార్టూన్‌లో ఆపేదవాని పరిస్థితి కన్నులకు కట్టినట్లుగా ఉంది. ఆకార్టూను వేసిన శ్రీ బాబుగారికి నా కృతజ్ఞతలు.

జయబాబు, (చిత్తూరు)

### వ్యాసాలు

22—6—73 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శ్రీ మాపే రామమూర్తిగారి ఉత్తరము చదివిన తరువాత ఇది వ్రాయకుండ ఉండలేకపోయాను.

ఆ ఉత్తరంలో రామమూర్తి గారు శ్రీ. శ్రీ. శ్రీ ఎస్. మోహన కుమార మంగళంగారిపై హాస్యాస్పదమైన మరియు సత్యదూరమైన వ్యాఖ్యలు చేశారు. ఎవరైనా ఒక్క తమిళుడు ప్రాంతీయ, కుల, మత తత్వ వాదము లేకుండా ఉన్నాడంటే మనకు గుర్తు వచ్చేది కుమార మంగళం గారు. ఉక్కుగనులశాఖ శ్రీ మోహన్ తీసికొన్న తరువాత ఆ శాఖలో ఎన్నో అభివృద్ధికరమైన మార్పులు జరిగినవి.

మోహన్ ఒక వ్యక్తి కాదు. ఒక మహత్తర సంస్థ. ప్రాంతీయ, కుల, మత, తత్వాలకు అతీతమైన ఒక అత్యుత్తమ శాస్త్రీయ సోషలిస్టు ఆదర్శ ధన్యజీవి.

దేశంలో మేధావి వర్గం ఎక్కువగా పెట్టుబడిదారులకు అనుకూలంగా ఉన్న రోజులలో పీడిత ప్రజలకు అంకితమైన మార్క్సిస్టు మేధావుల్లో ఒకడు.

ఉక్కు గనులశాఖలో పనిచేసిన ఇద్దరు ఆంధ్ర మంత్రులు శ్రీయుతులు చెన్నారెడ్డి, సంజీవరెడ్డి చేయలేని ఎన్నో పనులు శ్రీ మోహన్ చేశారు. ఒకవాడు సోషలిస్టులకు మాత్మగడ్డయైన తెలుగు


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938– 1972)

శుక్రవారం : 20-7-73
శ్రీప్రమాదినామ సం॥ ఆషాఢమాసం. బ. పంచమి

సంపుటము : 66 సంచిక : 44

స్థాపితం 1908

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1

విడి [illegible] 50 పైసలు




## విషయానుక్రమణిక


విదేశాలకి
విన్నపం
ఆహారం ఇచ్చి
ఇండియాకి
సహాయం చెయ్యండి!
విదేశీ సహాయం
ఎవరికి కావాలి!
ఇండియా
స్వయం
సమృద్ధిని సాధిస్తోంది.
ఇంకా ఉష్ట్రపక్షి తంతే
కేంద్రం
సమైక్య
వాదుల
సలహాలు
ఎల్.ఎన్. మిశ్రా వర్గం
పాండే వర్గం
బీహారు ముఖ్యమంత్రి గఫూర్
వరదలో చిక్కుకున్న బస్సు - వార్త
గుజరాత్ కాంగ్రెస్
ముఠా తత్వాలు

# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

### భీషాస్మాత్ వాతః పవతే :

భయం చాల పనులకు మూలకారణమన్నారు మనస్తత్వవేత్తలు. భగవంతుని భయంతో గాలి వీస్తున్నది, భగవంతుని భయంతోనే సూర్యుడు ఉదయిస్తున్నాడు— భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః— అని ఉపనిషత్తులు అంటున్నాయి. ఈ భయసిద్ధాంతం రాష్ట్ర రాజకీయాలకు నేడు బాగా అన్వయించవచ్చు. సమైక్యా సమైక్యవాదుల వర్గాలలో ఎవరు నాయకులవుతారో ఏమో, నాయకత్వం తమ ముఠా నుంచి జారిపోతుందో ఏమో అనే భయం, రాష్ట్రపతి పరిపాలన మిగియ వస్తుందనగా మితిమీరిపోతున్నట్లు కనిపిస్తున్నది. ప్రతి ముఠాలోను 'దోకనోజీ తీన్ చూల్హా'— ఇద్దరు కనోజీ స్వయం పాకాల్కు మూడు పొయ్యిలు— అన్న సామెతగా స్వయంపాకాలు ఉడకడంతో ఎదుటివారి వాదమో, ప్రకటనో చూడకుండా, వినకుండా, ఎవరికివారు పరిష్కారమార్గాలు, సూచనలు చేయడంవల్ల జంటనగరాల పౌరులు— ఆ మాటకవస్తే ఆంధ్రప్రదేశ్ ప్రజలు — విసిగిపోయి, రాష్ట్రపతి పరిపాలనే కొనసాగితే తప్పేముందని అనుకుంటున్నారు. ఇక ఈ వర్గాల పరస్పర విమర్శలు, ప్రకటనలు ఒక ప్రకటన అచ్చుతడి ఆరేలోపలే మరొక ప్రకటనగా పుంఖానుపుంఖంగా వచ్చిపడుతున్నాయి. ప్రత్యేక వాదుల నాయకుడు డాక్టర్ చెన్నారెడ్డి, శ్రీ బి. వి. సుబ్బారెడ్డి కలుసుకొని పరిస్థితిని పర్యవేక్షించగా, తెలంగాణా సమైక్యవాది ఉపసంఘ సభ్యులు 'శ్రీ రాజారాం తమకు తెలియకనే శ్రీ కె. సి. పంతుకు ఏదో సమైక్యపథకం అందజేశారు. రక్షణలు లేకుండా హైదరాబాద్‌ను స్వేచ్ఛామండలం చేయడానికి వీలులేదు' అని శ్రీ ఉమాశంకర్ దీక్షిత్‌కు విజ్ఞప్తి చేశారట. అబ్బ! భయం ఎంత చేస్తున్నదో!



డాక్టర్ ఆరిపిరాల విశ్వం
(చిత్రకారుడు : శ్రీ కొండపల్లి శేషగిరిరావు)

### మురికిపేటలు

మూడుకోట్ల రూపాయల వ్యయంతో ఆంధ్రప్రదేశ్ గృహనిర్మాణ సంస్థ ఈ సంవత్సరం కొత్త కళ్లు కడుతుందని సంస్థ చెయిర్మన్ శ్రీ ఎం. లోకనాథం జూన్ 23న పత్రికా ప్రతినిధులతో అన్నప్పుడు, నాకు మురికిపేటల సంగతి జ్ఞాపకం వచ్చింది చప్పున. తమిళనాడు ప్రభుత్వం మద్రాసు నగరం మధ్యన మెలికలు తిరుగుతూ పారే మురికినీటి కువ్వం నదిని నౌకా విహారయోగ్యం చేసి, మురికిపేటలను తొలగించి, మురికిపేటల నివాసుల కోసం వాడలు నిర్మించినప్పుడు మన ప్రభుత్వమూ ఎందుకు చేయగూడదు— అని ఎవరైనా అనుకోవచ్చు. మన నగరాలు ఎంత సుందరాలు? కాని కనీసపు పౌర సౌకర్యాలు లేవు. ఇరవైయేళ్ళక్రితం వచ్చిన ఒక ఇటలీ పత్రికారచయిత విజయవాడను చూచి 'ఆహా వెన్నీస్‌వలె వుంది. ఊరి మధ్యన కాలువలు, కొండలు, పక్కన నది ఎంత అందం!' అన్నాడు. మనం వాటిని ప్రాతఃకృత్యాలకు వాడుతున్నాము. జంట నగరాల మధ్యన వున్న మూసీ నగరాల అందాన్ని ఎంతేనా ఇనుమడింపచేయవచ్చు. ఎన్ని కొత్త ఇళ్లు కట్టినా, మురికిపేట వారిని మనసులో పెట్టుకోకపోతే జంటనగరాలు కలకత్తాలాగ తయారవుతాయని నా భయం.

### మేనేజర్ ఆఫ్ ది ఇయర్ :

హైదరాబాద్ మేనేజ్‌మెంట్ అసోసియేషన్‌వారు ఏర్పాటు చేసిన 'మేనేజర్ ఆఫ్ ది ఇయర్' బిరుదం ఈ యేడు ఆంధ్ర షుగర్స్ చెయిర్మన్ శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్రప్రసాద్‌కు లభించడం ఆయన నిర్వహణ నైపుణ్యానికి తార్కాణ. ఇది తొలి అవార్డు కావడం మరొక విశేషం. శ్రీ ప్రసాద్ వివిధపరిశ్రమలను నిర్వహిస్తున్నవారే కాక, సాహిత్య సంస్కృతులకు ఆంధ్రప్రదేశ్‌లో ఆలంబనమయినవారు. ఈ బిరుద ప్రదానం చేసిన కేంద్ర భారీ పరిశ్రమల మంత్రి శ్రీ టి. ఏ. పాయి అన్నట్లు పారిశ్రామికులు తమ వస్తువులతో కొనుగోలుదారులను సంతృప్తిపరుస్తూ, తాము తయారు చేసే వస్తువుల నాణ్యం తగ్గకుండా, లభించిన లాభాలను ప్రజాసామాన్య శ్రేయస్సుకు వినియోగించ గలిగితే, సాధన సంపత్తి అపారంగా వున్న ఆంధ్రప్రదేశ్, పరిశ్రమల విషయంలో ఎంతో వెనుకబడిన ఆంధ్రప్రదేశ్ ఎంతో ముందడుగు వేస్తుంది.

### ఇదా హాస్టళ్లు !

మంచి భోజనం, వసతి, విశ్రాంతి వున్నప్పుడే విద్యార్థులు చదివి పైకి రాగలుగుతారు. కాని, కొన్ని హాస్టళ్ల పరిస్థితి చూస్తే, పాపం, విద్యార్థులు ఎలా వేగుతున్నారా, అనిపిస్తుంది. గవర్నరు సలహాదారు శ్రీ షరీఫ్ చూచిన ఒక హాస్టలు సంగతి జగద్విదితం. అయినప్పుడు జూన్ నెల 26న సరోజినీదేవి హాలులో జరిగిన విద్యార్థి యువజన సమావేశం హాస్టళ్లకు ప్రభుత్వం సహాయధనం ఆపివేయందుకు

[illegible] హాస్టళ్లను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని కోరడం ఎంతో సమంజసం. హాస్టళ్ళ పరిశీలనకు ప్రత్యేకంగా శాసన మండలి నియమించిన సంఘం సభ్యులు శ్రీయుతులు పి. వి. రాఘవాచార్యులు, కె. విల్. మహేంద్ర మొదలయినవారి ప్రసంగాలు విన్న తర్వాత శత్రువు పిల్లలకు కూడా ఇలాటి హాస్టళ్లు వద్దని పిల్లల తలిదండ్రులు భావించారు.

## మరి రెండు సన్మానాలు

ఆంధ్రప్రదేశ్ వారినిద్దరిని వరల్డ్ పొయెటీ సొసైటి ఇంటర్నేషనల్ ఈ సంవత్సరం సన్మానించడం జంటనగరాల వారికి చాల సంతోషకరమయింది. ఈ సంస్థ వార్షిక సమావేశం జూన్ 16, 17 న మద్రాసులో జరిగింది. అన్ని రాష్ట్రాలనుంచి 50 మందికి పైగా ప్రతినిధులు అంటే, ఆంగ్లకవిత చెప్పే భారతీయులు. హాజరయ్యారు. డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ, పి. బి. శ్రీనివాస్ శ్రీమతి హేమంతా ఆంజనేయులు, ప్రొఫెసర్ స్టియన్ అమీరుద్దీన్, శ్రీమతి బానోతాహిరాసంయాద్, డాక్టర్ అరిపిరాల విశ్వం మొదలయిన తెలుగువారు తమ కవితలు చదివారు; డాక్టర్ శర్మ ఆధునిక తెలుగు కవితారీతులు అనే వ్యాసం చదివారు. పదకొండు మందికి 'వరల్డ్ పొయెట్రీ అవార్డులు' లభించాయి. వీరిలో ఇద్దరు హైదరాబాద్‌వారు—శ్రీమతి బానో తాహిరాసంయాద్, డాక్టర్ అరిపిరాల విశ్వం. అక్టోబరులో ఆల్‌వరల్డ్ పొయెట్స్ మీట్ (ఆంగ్లంలో కవిత చెప్పేవారి) జరుగుతుంది. తాహిరాసంయాద్ బ్రిగేడియర్ సంయాద్ సతీమణి. ఇరాన్, ఆంధ్రప్రదేశ్‌లలో పెక్కు సన్మానాలు పొందింది ఆంగ్ల ఉరుదూ కవితలకు.

## డాక్టర్ అరిపిరాల విశ్వం

'రివర్ పైగురు' అనే ఆంగ్లకవితా కదంబానికి వరల్డ్ పొయెట్రీ సొసైటీ ఇంటర్నేషనల్ అవార్డు పొందిన డాక్టర్ అరిపిరాల విశ్వం పండిత వంశంవారు. స్థానిక మ్యాపైన్స్ కాలేజీలో ఆంధ్రాచార్యులు. భావనలో అపూర్వోన్నతులకు, పరిశీలనలో గంభీరాగాధాలకు నెలవైన విశ్వం ఇదివరకే తెలుగులో సుప్రతిష్ఠితులైన ఆధునిక కవి. నిదురకన్నెలు, కాలం గీస్తున్న గీత, రేపటి స్వప్నం, మనమ్మె వంటి రచనలతో వచనకవితను మరింత ముందుకు తీసుకు వెళ్లినవారు. ఆయన హాశేబీలు కావ్యం శిల్పదర్శనాలను భూతుల అపరంజి వెలుగు. దర్శన నిష్పాక్షికమయిన ఆధునిక కవితాసంకలనం. ప్రాణపంజరం, అగ్నికిరీటం, జందేవత అనే నవలలు మాతవరీతులు, వందర్మాతులు — వెయ్యి జ్ఞాపకాలు అనే నవలను, ఆస్తిక నాస్తిక తటస్థ యువకుల జీవితదర్శనంగా, అనుభూతితత్త్వంగా వ్రాస్తున్నారు. ఆంగ్లంలో వేలసంఖ్యన ఖండికలు రచించారు. పత్రికలలో. పుస్తకరూపం పొందింది; వెంటనే అవార్డు పొందింది ఈ 'రివర్ పైగురు.' భావుకతకు తోడు పరిశోధన పరాయణము. ఆధునికాంధ్ర కవిత్వంలో ప్రకృతి– మానవుడు అనే సిద్ధాంత వ్యాసం వ్రాసి డాక్టరేట్ పొందినవారు. తాంత్రిక సంబాలిజం ట్రూపిజెస్ ఇన్ ఇండియా. నంబర్స్ డైలెక్టిక్స్ అనే గ్రంథాలు ఆంగ్లంలో రచిస్తున్నారు. సంఖ్యాశాస్త్రంలో 23 నూతన సిద్ధాంతాలు కనుగొన్నారు. డాక్టర్ విశ్వం ఇంకా 36 సంవత్సరాల నవయువకుడే గనుక ఆంధ్రాంగ్ల కవితా ప్రపంచంలోను, పరిశోధనలోను నిండు వెన్నెలలు పండించుకుంటారు.

## ఉపశ్రుతి

'అబ్బ! వాన రెండు చినుకులు పడింది అడుగువేయలేమండీ గల్లీలలో' అని గొణుక్కున్నాడు తోటి పౌరులలో ఒకరు వెళ్తూ, జాంబాగ్ ప్రాంతంలో. 'వర్షం మీరు చూస్తారో లేదోనని ఇక్కడ్నే వర్షం చూయిస్తుండరు మున్సిపల్‌వాళ్లు!' అంటూ ఒక శ్రమైకసుందరి నెత్తిమీద చెత్తగంపను ఎత్తిపోసింది. ●



మహేష్ ది

ముగురు మూర్ఖులు







# బామ్మగారి యేకాదశి

'మనదేశంలో ప్రజాస్వామిక విధానం చక్కగా అమలు జరుగుతున్నదని యిప్పుడు మనం ఖాయంగా చెప్పవచ్చును' అన్నాడు చిదంబరం.

'ఏం? యేందుచేత?' అని అడిగాడు మూడామణి.

'ఉత్తరప్రదేశ్‌లో రాష్ట్ర - సాయుధ పోలీసు దళాలు తిరుగుబాటు జరిపాయి. అది రాష్ట్రప్రభుత్వం యొక్క వైఫల్యానికి చిహ్నం కాదా? అందుచేత ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి కమలాపతి త్రిపాఠీ రాజీనామా చేశాడు. మన దేశంలో ప్రజాస్వామ్య విధానాలు ఖచ్చితంగా అమలు జరుగుతున్నాయనడానికి యింతకంటే నిదర్శనం యింకేం కావాలి?'

'తన ప్రభుత్వం విఫలమైపోయినందు చేతనే కమలాపతి త్రిపాఠీ రాజీనామా చేశాడని నువ్వు చెప్పగానే, యిదివరకు ఒక పుల్లయ్య చెప్పిన మాట నాకు గుర్తు వచ్చింది' అన్నాడు మూడామణి.

'ఏమిటా పుల్లయ్య చెప్పిన మాట?' అని చంచలావు ప్రశ్నించగా మూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక పుల్లయ్య యెల్లయ్యవద్ద వంద రూపాయలు అప్పు పుచ్చుకొన్నాడు. తరువాత యెల్లయ్య యెన్నిసార్లు అడిగినా, పుల్లయ్య అప్పు తీర్చలేదు. అందుచేత యెల్లయ్య గ్రామపెద్ద దగ్గర తగాయిదా పెట్టాడు.

పుల్లయ్య, తాను యెల్లయ్యవద్ద అప్పు పుచ్చుకోలేదని గ్రామపెద్ద దగ్గర డబాయించాడు.

యెల్లయ్య అప్పుడు కొంతమంది సాక్షులను తీసుకొని వచ్చాడు. వారందరూ కూడా 'పుల్లయ్య యెల్లయ్యవద్ద అప్పు తీసుకోవడం చూశా' మని సాక్ష్యం చెప్పారు.

సాక్ష్యం విన్న తరువాత గ్రామపెద్ద 'ఇప్పుడేమంటావు?' అని పుల్లయ్యను అడిగాడు.

'యెల్లయ్యవద్ద నేను అప్పు తీసుకున్న మాట నిజమేనండి' అంటూ పుల్లయ్య యదార్థాన్ని అంగీకరించాడు.

'మరి యీమాట మొదటే యెందుకు చెప్పలేదు?' అని గ్రామపెద్ద పుల్లయ్యను ప్రశ్నించాడు.

'నేను యెల్లయ్యవద్ద అప్పు తీసుకోవడం యింతమంది చూశారని అప్పుడు నాకేం తెలుసండి' అన్నాడు పుల్లయ్య' అంటూ పుల్లయ్య చెప్పిన మాటను వివరించాడు మూడామణి.

'అయితే ఆ పుల్లయ్య మాటకు, కమలాపతి త్రిపాఠీ రాజీనామా చేయడానికి పోలిక యేమిటి?' అని అడిగాడు చిదంబరం.

'మొట్టమొదట పుల్లయ్య తాను యెల్లయ్యవద్ద అప్పు తీసుకోలేదని డబాయించాడు కాని సాక్ష్యం తనకు వ్యతిరేకంగా

ఊడడంవల్లనే ఆఖరికి అతను యెల్లయ్య వద్ద అప్పుపుచ్చుకొన్నట్లుగా అంగీకరించాడు. అలాగే కమలావతి త్రిపాఠీకూడా రాష్ట్రసాయుధ పోలీసుదళాలు తిరుగుబాటు జరిపినా కూడా, అధికారాన్ని అంటిపెట్టుకొని ఉండడానికే ప్రయత్నించాడు కాని అతను రాజీనామా చేయాలని కాంగ్రెసు అధిష్టానవర్గం పట్టుపట్టింది. అందుచేత కమలాపతి త్రిపాఠీ రాజీనామా చేశాడు. ఈ పరిస్థితిలో ఈ పుల్లయ్య మాటకూ, ఈ త్రిపాఠీ రాజీనామాకు తేడా యేమిటి?' అని తిరిగి ప్రశ్నించాడు చూడామణి.

'జూన్ 12 వ తేదీన కమలాపతి త్రిపాఠీ రాజీనామాచేస్తూ ఈ 'రాజీనామా చేయాలనే నిర్ణయం నేనే తీసుకొన్నాను. రాష్ట్రసాయుధ పోలీసుదళాల తిరుగుబాటుకు రాష్ట్రముఖ్యమంత్రిగా, హోం మంత్రిగా తనకు నైతిక బాధ్యత ఉన్నదని చెప్పాడు. ఈ పరిస్థితిలో కాంగ్రెసు అధిష్టానవర్గం పట్టుపట్టడంవల్లనే త్రిపాఠీ రాజీనామా చేశాడని నువ్వు యెలాగ చెప్పదలవు?' అని అడిగాడు చూడామణి.

'నైతిక బాధ్యత ఉండడంవల్లనే తాను రాజీనామా చేశానని కమలావతి త్రిపాఠీ అన్నాడనగానే నాకు ఒక బామ్మగారు చేసిన యేకాదశి ఉపవాసం జ్ఞాపకం వచ్చింది.'

'ఏమిటా బామ్మగారి యేకాదశి?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'ఒక బామ్మగారు పొద్దున్నే 'రామా! కృష్ణా' అంటూ దైవనామస్మరణ చేస్తూ కూర్చున్నారు. బామ్మగారి దొడ్లో పువ్వులు కోసుకోవడానికి పక్కింటి అమ్మాయి బామ్మగారింటికి వచ్చింది.

'ఏం బామ్మా! యింకా వంట చేయడం లేదా?' అని ఆ అమ్మాయి బామ్మగారిని అడిగింది.

'ఈవేళ యేకాదశి. ఎంతకాలంనుంచో నేను యేకాదశినాడు ఉపవాసం ఉందామని అనుకొంటున్నాను. కాని యింతవరకు ఉండలేదు. అందుచేత ఈ యేకాదశినాడు ఉపవాసం చేస్తాను.'

'సరే, అమ్మా!' అంటూ ఆ అమ్మాయి పువ్వులు కోసుకోవడానికి లోపలకు వెళ్ళి, తిరిగి వచ్చేసరికి బామ్మగారు పొయ్యి వెలిగించి, అప్పుడే వంట ప్రయత్నం చేస్తున్నారు.

# 'భర్తతో కాపురం చేసుకోవడమే నా ఫుల్ టైమ్ జాబ్'

'లవ్ ఎట్ ఫస్ట్ సైట్' అనేదాన్ని నేను నమ్మను. బస్సుల్లో అమ్మాయిలు అబ్బాయిలూ నవ్వుకోవడం శుద్ధ ఫార్స్. బాగా తెలిసివుండడంవల్లనే ప్రేమ పుట్టుకొస్తుంది—' అంటుంది కుమారి లలితా అర్రుద. ప్రెసిడెన్సీలో బియ్యే ఫస్టియర్ (సైకాలజీ) స్టూడెంటు.

'అందరూ చేస్తున్న పని చెయ్యడం తనకి ఇష్టం లేదట. కష్టమైన పని చెయ్యడమే ఆనందమట — అందుకే సైకాలజీ సబ్జెక్టు తీసుకుందట.

'కట్నం అడక్కుండా, తిండి పెట్టి మర్యాదగా మనిషినిమనిషిగా చూసే వాడ్ని పెళ్ళిచేసుకుంటాను. పెళ్ళయిన తర్వాత ఉద్యోగం చెయ్యను. కాపురం చేసుకోవడమే నా ఫుల్ టయిమ్

## క్విక్కింటర్వ్యూ

వుద్యోగం. నన్ను పోషించడం అతడి డ్యూటీ...' అన్నది.

'నా కంటే పొడవుగా వుండాలి. నల్లగా వుండాలి. శరీర దారుఢ్యం కలిగివుండాలి. అందంగా వుండక్కర్లేదు'— ఈ క్వాలిఫికేషన్స్ వున్న వాడినే చేసుకుంటుందట.

పొడవుగావున్నా అమితాబ్ బచ్చన్అంటే ఇష్టంలేదు. అతనిజుట్టు అసహ్యంగా వుంటుందట. 'నాకు ధర్మేంద్ర అంటే ఎంతో అభిమానం. 'హియ్ ఈజ్ ది మాన్ ఆఫ్ మై డ్రీమ్స్'. కాని కొంచెం కలర్ వుంటాడు అదే చిక్కు...' అంది.

ధర్మేంద్ర సినిమాలకి మంచిబట్ట లేసుకుని స్టయిల్‌గా వెళ్తుంది.

'డ్రస్సు వేసుకున్నంతమాత్రాన ఆధునాతనంగా కనిపించరు. వ్యక్తిత్వం మారాలి. అవుట్ లుక్ మారాలి. అప్పుడు ఆ డ్రస్సు బాగా నప్పుతుంది' అంటుంది.

లలితకి పువ్వులంటే ఇష్టంలేదు. నగలంటే అసహ్యం.

సినిమాల్లో వయసుకుతగ్గ వేషాలు వేసేవాళ్లంటే నాకు అభిమానం ఉదాహరణకి: అశోక్‌కుమార్. 'రామారావు, నాగేశ్వరరావు రిటయిరయిపోవాలి.' అనే ఈ 'డాషింగ్ డేమ్‌సెల్'కి తెలుగు హీరోల్లో కృష్ణ అంటే ఇష్టం. హీరోయిన్స్‌లో ఎవరన్నా యిష్టంలేదు.

కథలు రాయడం, ఫేస్ రీడింగ్, పామిస్ట్రీ, ఫ్యూచర్ టెల్లింగ్ ఆమె హాబీలు.

పామిస్ట్రీ తను నమ్మదు. ఎదుటి



లలితా అర్రుద

వాళ్లని నమ్మించడంలోనే తనకి ఆనందం!

'మగవాడికి ఆడది ఎప్పుడూ లొంగి వుండాలి'— అనేది స్త్రీ స్వాతంత్ర్యం మీద లలిత అభిప్రాయం.

పూర్వం, సులోచనారాణి రచన లంటే నచ్చేవట. రామలక్ష్మి మామూలు ప్రేమ కథలు రాస్తుంటారట. అర్రుద జీనియస్. ఇప్పుడు పురాణం సుబ్రహ్మణ్యశర్మ అంటే వల్లమాలిన అభిమానం.

అభిరుచుల్లోనూ, నడవడికలోనూ ఎంతో ప్రత్యేకత సంతరించుకున్న లలిత చదువు పూర్తయ్యేదాకా పెళ్ళి కాకపోతే లెక్చరరుగా స్థిరపడుతుందట!

—సికరాజు.

# ముగ్గురమూర్ఖులు

అమ్మాయి అది చూసి 'ఏం బామ్మా! ఉపవాసం ఉంటానన్నావు కదా! మళ్ళా వంట చేస్తున్నావెందుకు?' అని అడిగింది.

'ఏం లేదే, నువ్వు లోపలకు వెళ్ళిన తరువాత మా పాలేరు జొన్నపాలు తెచ్చాడు. ఆవు జొన్న తిని యెన్నాళ్ళయిందో! ఏకాదశంటే ప్రతి పదిహేను రోజులకూ వస్తుంది కాని జొన్నపాలు అస్తమానూ వస్తాయా? అందుచేత యీ వేళ జొన్న తినేసి. మళ్ళా యేకాదశికి ఉపవాసం ఉందామనుకొన్నాను' అంది బామ్మగారు.

'అలాగా బామ్మా! అయితే నాక్కూడా కొంచెం జొన్న పెట్టవా?'

'కొంచెంసేపు అయిన తరువాత రావే! నీక్కూడా జొన్న పెడతాను.'

కొంచెంసేపు అయిన తరువాత జొన్న కోసం అమ్మాయి బామ్మగారింటికి మళ్ళా వెళ్ళింది. ఆ సమయంలో బామ్మగారు తిరిగి, 'రామా! కృష్ణా!' అంటూ దైవనామ స్మరణ చేస్తూ కూర్చున్నారు.

'బామ్మా! మళ్ళా నువ్వు 'రామా! కృష్ణా!' అంటూ కూర్చున్నావు. జొన్న తినలేదా?

'లేదే, ఉపవాసం చేస్తున్నాను. ఈ యేకాదశి చాలా గొప్ప యేకాదశని నిన్న పురాణంలో శాస్త్రులుగారుకూడా చెప్పారు. అందుచేత యీ యేకాదశినాడే ఉపవాసం చేద్దామనుకొన్నాను' అన్నారు బామ్మగారు.

'అయితే, జొన్న నాకు పెట్టు బామ్మా! అని అడిగింది అమ్మాయి.

'ఇంకెక్కడి జొన్నే, పిచ్చిపిల్లా! పాల దిన్నె మీద పిల్లి యెగిరిపడింది. పాలన్నీ ఒలికిపోయాయి. అందుచేతనే ఉపవాసం చెయ్యాలని తిరిగి నిర్ణయించుకొన్నాను' అంది బామ్మగారు.' అంటూ చూడామణి బామ్మగారి యేకాదశి ఉపవాసాన్ని గురించి చెప్పాడు.

'నైతిక బాధ్యతవలన తాను రాజీనామా చేశానని కమలాపతి త్రిపాఠీ చెప్పాడనగానే నీకు బామ్మగారి యేకాదశి యెందుకు గుర్తు వచ్చింది' అని చంచలాక్షు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'రాష్ట్ర సాయుధ పోలీసుదళాలు జరిపిన తిరుగుబాటుకు – రాష్ట్ర ముఖ్యమంత్రిగా, హోం మంత్రిగా తనకు నైతిక బాధ్యత ఉన్నదని కదా! త్రిపాఠీ తాను ముఖ్యమంత్రిపదవికి రాజీనామా చేశానని అంటున్నాడు. అదెంతవరకూ నిజమో కొంచెం పరిశీలిద్దాం.

1973 వ సంవత్సరం మే నెల 21–24 తేదీలమధ్య ఉత్తరప్రదేశ్ సాయుధ పోలీసుదళాలు తిరుగుబాటు జరిపాయి.

మే 30వ తేదీని పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ కమలాపతి త్రిపాఠీ తన మంత్రివర్గాన్ని పునర్నిర్మించే ఉద్దేశం తనకు లేదని స్పష్టంగా చెప్పాడు. కాని సాయుధ పోలీసుదళాల తిరుగుబాటుకు తనకు గల నైతిక బాధ్యతను గురించి కొంచెం కూడా చెప్పలేదు.

జూన్ 3 వ తేదీని కమలాపతి త్రిపాఠీ ఢిల్లీలో పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ 'తాను మంత్రివర్గంలో మార్పులు చేయబోతున్నా'ననే వార్తలను ధృవపరిచాడు కాని అప్పుడుకూడా తన నైతిక బాధ్యతను గురించి యేమీ ప్రస్తావించలేదు.

కాంగ్రెసు అధిష్టానవర్గంతో యెన్నో సమావేశాలు జరిపిన తరువాత కమలాపతి త్రిపాఠీ జూన్ 12 వ తేదీని ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశాడు. ఆ సందర్భంలోమాత్రం త్రిపాఠీ రాష్ట్ర సాయుధ పోలీసుదళాలు జరిపిన తిరుగుబాటుకు నైతికబాధ్యత తనకు ఉన్నదని ప్రకటించాడు.

రాష్ట్ర సాయుధ పోలీసుదళాలు తిరుగుబాటు జరిపిన తరువాత యిరవై రోజులకు గాని, త్రిపాఠీకి తమ నైతిక బాధ్యత గుర్తుకు రాలేదు.

ఈలోపున కాంగ్రెసు అధిష్టానవర్గం త్రిపాఠీ రాజీనామా చెయ్యాలని ఒత్తిడి చేసిందని పత్రికలు వ్రాశాయి.

అప్పుడు త్రిపాఠీ రాజీనామా చేయవలసిన పరిస్థితి యేర్పడింది. వెంటనే త్రిపాఠీకి తన నైతిక బాధ్యత గుర్తువచ్చింది. అందుచేత ఈ కమలాపతి త్రిపాఠీకి, జొన్నపాలు ఒలికిపోగానే, యేకాదశి ఉపవాసం చేయదలుచుకొన్న బామ్మగారికి తేడా యేమిటి?' అని అడిగాడు చూడామణి.

'అయితే, ఈ విషయంలో కాంగ్రెసు అధిష్టానవర్గంయొక్క వైఖరిమాట యేమిటి?'

'దాన్ని గురించి మరోకసారి చెప్తాను' అంటూ చూడామణి లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు.

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## దేవుళ్ల బంగారం!

రాష్ట్రంలో వున్న దేవాలయాలలోని దేవుళ్ళ బంగారు ఆభరణాలలో అనవసరమైన ఆభరణాలుగా కొన్నిటిని కేటాయించి ఆ ఆభరణాలనన్నిటినీ సమీకరించి, కరిగించి బంగారు కడ్డీలుగా చేసి దాచిన ఎట్లుండును అన్న విషయం మీద పైనూర ప్రభుత్వం ఆలోచిస్తుందట — ఇంకెట్లుండును, బంగారు కడ్డీలవలెనే కదా!

### విగ్రహాల చోరీ

దక్షిణభారత దేశం నుంచి గత ఏడు సుమారు 111 విగ్రహాలు అనేక దేవాలయాలలోంచి తస్కరింపబడా యుట. వీటిలో సుమారు 50 విగ్ర




హాలు దొరికాయుట. ఈ విషయాలను ఈ శాఖ డిప్యూటీ సూపరింటెండెంటు మిస్టర్ చంద్ర మౌళిగారు కలకత్తాలో బయట పెట్టారట — వహ్వా.

### పిల్లలు పుట్టలేదని భార్యాభర్తల ఆత్మహత్య

వివాహమయి మూడేళ్ళయినా యింకా తమకు సంతతి కలగక పోడాన్ని తమ చుట్టాలు, పక్కాలు అయిన వారు, కానివారు, అవబోయిన వారు, అవుతూన్నవారు.. అంతా కలసి అనుమానించి పదేపదే మాట్లాడ్డాన్ని భరించుకోలేక, పవన్‌చేరి గ్రామంలో వో భార్యాభర్తలు ఆత్మహత్య చేసుకున్నారట.

ఈ విషయం వో వుత్తరం ద్వారా వారు తెలియ బరచారట.

### అట్టలతో ఇళ్లు!

వెస్ట్ జర్మనీలో అట్టలతో యిళ్ళు కట్టి అవి మామూలు యిళ్ళకు ఏమాత్రం తీసిపోవనీ, ఆ మాటకొస్తే వాటికన్నా గొప్పవేననీ నిరూపించారట. ఈ యిల్లు మొత్తం బరువు రెండ వేల తొమ్మిది వందల పౌనులు కన్నా వుండదట ఈ యింటికి మామూలు తరహా కిటికీలు, ద్వార బంధాలు, ద్వారాలూ కూడా పెట్టుకోవచ్చుట. ముగ్గురు మనుష్యులు నాలుగు రోజుల్లో సునాయసంగా యీ యింటిని నిర్మించవచ్చునని, యిల్లు వానకు, ఎండకు, నిప్పుకు, నీరుకు (సముద్రపు నీరు) కూడా ఏమీ పాడవదని వారన్నారట. ఈ అట్టలకు ఒకరకం ప్లాస్టిక్ కోటింగ్ వుంటుందట.




### పాలితప్పితే బంగారం

కోవెలకుంట్లకు చెందిన బనగానిపల్లెలో [illegible] మాను మఠంలో వో సాధుగారు నుయ్యి త్రవ్విస్తుండగా అందులో 21 బంగారు మట్టెలు దొరికా యట. వాటి నాయన బనగానపల్లి సబ్‌ఇన్‌స్పెక్టరుకు యిస్తే, ఆ సబిన్‌స్పెక్టరు వాటిని కర్నూలుజిల్లా కలెక్టరు వారికిచ్చాడట — వారెవరికిచ్చిరి. . .చివరికవి ఏమాయెను!

### ప్రేమికులని కలిపిన న్యాయం

కేరళకు చెందిన కొచ్చిన్‌లో బాలగోపాల్ అనే వో డాక్టరుగారు 22 ఏళ్ళ ఇందిర అనే ఆమెన్ను ప్రేమించి, ప్రేమింపబడ్డాడట. వారి వివాహాని



ఇందిర తల్లితండ్రులు వొప్పేమిరా అని, వేరు కులం వానిని పెళ్ళాడ వీల్లేదని, అదేందు కంటే ఆమెను ఇంట్లోనే నిర్బంధించి, ఆమెకు వేరే పెళ్ళి సన్నాహాలు చేయ నారంభించారట. ఈ విషయం అనుమానించిన బాలగోపాల్ తను పెళ్ళాడ దల్చుకున్న అమ్మాయినామె తలిదండ్రులు బలవంతాన్న యింట్లో బంధించారని, న్యాయం కావాలని కోర్టును అడిగారట. కోర్టువారు ఆమెను విడుదల చేయమని ఆమె తలితండ్రులకు ఆజ్ఞ యిచ్చి, ఆమెను విచారించి, ఇందిర నావిధంగా నిర్బంధించే అధికారం ఆమె తలిదండ్రులకు లేదని, ఆమె తన యిష్టం వచ్చిన వారిని పెళ్ళాడే అధికారం కలిగి వున్నదనీ కూడా తీర్పు విచ్చారుట. లాంగ్లివ్ దీ లా!

(64వ పేజీ చూడండి)




పునరపి జననం!

పునరపి మరణం!

ఈ మాటే రోజుకు లెక్కలేనన్నిసార్లు అంటూ వుంటాడు పు[illegible]ల సాహెబ్ అబ్బు ఖాంయీఖాన్! వయస్సు తొమ్మిది పదులు దాటినా యింకా పసివాడిగానే కనిపిస్తాడు. ముస్లిమ్‌ల యింట జన్మఎత్తినా, ఎందుకనో అతగాడు చిన్నప్పటినుంచి అంబికా భక్తుడైయ్యాడు. ఈ ధోరణి చూసి తల్లి తండ్రులు, గాలి ధూళి సోకిందేమోనని భయపడి ఫకీరులకు సాధువులకు చూపించారు. వాళ్ళు అతనినిచూసి రోగం లేనివాడికి వైద్యం చెయ్యలేమని అన్నారు.

అంతటితో ఆ ఆగడం తీరలేదు తనకు ఉపనయనం చెయ్యమని తల్లి తండ్రులని

కోరడం మొదలు పెట్టారు.

అటు కఫీరు కాదన్నారు. ఇటు మౌల్వీలు కాజీలు వీల్లేదన్నారు. ఈ సందిగ్ధంలో యింట్లోంచి మాయమైయ్యాడు యూ వేదార్థి. ఏమి అఘాయిత్యం చేశాడేమోనని కొండల కోనలూ నూతులు బావులు అన్నీ వెదకి వేసారిపోయారు ఇంటి దగ్గరవాళ్ళు.

కాలం ఆనాటి కానాడు గడవగా గుండె రాయిచేసుకుని అతన్ని మరిచి పోవటం మొదలు పెట్టారు.

కాలం ఎవ్వరికోసం ఆగలేదు. మతిభ్రష్టుడు జాతిభ్రష్టుడైన పుత్రుడికోసం బెంగపెట్టుకుని కృంగి కృశించి కాలగర్భంలో కలిసిపోయారు తల్లి దండ్రులు.

కాలం మారింది. దేశం మారింది. తరాలు మారిపోయాయి. చాలా రోజుల తరువాత వచ్చింది మెరుపులాంటి వార్త. ఆ రోజు సాయంకాలం స్వాములవారు వస్తున్నారు తమ గ్రామానికి!!

తమ మహిమతో, వాగ్మాధురితో దేశదేశాలన్నింటా ఉర్రూతలూగించిన సమ్మోహన చక్రవర్తి. ఆ కుగ్రామానికి విచ్చేస్తున్నారంటే, అక్కడి ప్రజలు ఎవ్వరూ నమ్మలేదు ఆయనకు ఆతిధ్యం యిచ్చి ఒక్క రోజు పాదపూజ చేయగల అర్హతగాని ఆర్థిక స్థోమతగాని యీ గ్రామంలో ఎవ్వరికీ లేదు. శ్రీచరణులు విచ్చేస్తే వారి విడిదికి కావలసిన వసతికూడా ఆ వూళ్లోనే కాదు చుట్టుప్రక్కల నాలుగైదు గ్రామాలలోకూడా లేదు.

ఈ సమస్యలకు పరిష్కారం, సమాధానం లభించేలోపలే స్వాములవారు రావడం జరిగింది చెరువు గట్టున బసచెయ్యడం జరిగింది. శ్రీవారిని చూడటమేమిటి! ప్రజలలో ఎక్కడలేని ఉత్సాహం పెల్లుబికి వచ్చింది. చూస్తూండగానే పాకలు పందిళ్లు లేచాయి. ప్రదోషకాలం అయ్యేసరికి అమ్మవారి పూజ పూర్తికావటమే కాదు. భక్తులకు తీర్థప్రసాదాలుకూడా ఇవ్వడం జరిగింది! కోలాహలం తగ్గింది, సద్దుమణిగింది.

అంతలోనే అకస్మాత్తుగా సంచలనం, కలవరం. శ్రీచరణులు ఇటే విచ్చేస్తున్నారు. మళ్ళీ నిశ్శబ్దం!! ఎటుచూసినా అప్రమత్తత!

ఆయన ఒక్కొక్క అడుగే ముందుకు వస్తున్నారు. అందరినీ దాటి ఎవరికోసమో చూశారు. ముఖంలో మందహాసం వెయ్యి వెలుగుల వెలిగింది, ఒక మనిషివంకచూసి దగ్గరకు రమ్మని సైగచేశారు.

ఆ వ్యక్తి దగ్గరకువచ్చి సాష్టాంగ ప్రణామం చేశాడు.

ప్రజలంతా ఒక్కసారి అతని వంక అవాక్కుగా చూశారు. ఏనాడో యిల్లు వదిలి వెళ్లిపోయిన అబ్బా భాయీస్ పోలికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

కాని ఇతను పిలక పెట్టుకున్నాడు. మెడలో యజ్ఞోపవీతం వుంది. ముందుకు సాగిపోతున్న స్వామివారి వెంట అతనూ నడుచుకుంటూ వెళ్ళాడు. శ్రీచరణులు స్వయంగా అతనికి తీర్థప్రసాదం యిచ్చారు.

అతనివంకచూసి 'మోక్షసిద్ధికి స్వధర్మమే శ్రేష్ఠము' అని అన్నారు. శ్రోత ముఖం నవ్వులతో నిండిపోయింది. మెరుపులు మెరిసినాయి. వెన్నెల వచ్చింది.

'అంతేనా?' అని ఎదురుప్రశ్న వేశాడు.

'ఉత్కృష్టమైన గమ్యం చేరాలంటే శ్రేష్టమైన మార్గమే అవలంబించాలిగా!'

'కాదని అంటే?'

'సగుణంనుంచి నిర్గుణం క్రమబద్ధం. నిర్గుణంనుంచి సగుణం లోక విరుద్ధం. కొన్ని జన్మల సాధన, తపస్సు వ్యర్థం.'

'ఎందుకని?'

పై మెట్టు మీదనుంచి క్రిందకు దిగివస్తే, పైకి వెళ్ళాలంటే మళ్ళీ ఈ మెట్లన్నీ ఎక్కాలిగా! అప్పుడు ఈ జన్మ చాలకపోవచ్చు. మరుజన్మలో ఉత్కృష్టమైన ఈ మానవజన్మ రాకపోవచ్చును. గమ్యం చేరడానికి ఆలస్యం అంతకంతకు అధికం కావటంలేదా?

'మనం పై మెట్టుమీద ఉన్నామను అనుకోవటం పొరబాటేమో?'

'తన ఉనికిని గ్రహించలేనివాడు. తన స్థితిని గుర్తించలేడు. గమ్యాన్ని ఈక్షించలేడు. లక్ష్యాన్ని సాధించలేడు.'

అంటే ఈ తపస్సంతా వ్యర్థమా?

తపస్సు చేస్తున్నానని చేసే తపస్సు ఎప్పుడూ వ్యర్థమే!

కారణం.

తపోలక్ష్యం మోక్షసాధనకే అంతేకాని

అంతేకాని?

తపస్సు ఒక లక్ష్యం మాత్రమే. గమ్యం కాదు.

అంతేనా?

అంతే!!

తక్షణ కర్తవ్యం?

బాధ్యతలను గుర్తించడం.

ఎటువంటి బాధ్యతలు?

నైతిక వ్యక్తిగత సాంఘిక బాధ్యతలు.

అవి మోక్షానికి దారిచూపించుతాయా?

శ్రీచరణుల ముఖంలో మందహాసం కనిపించింది.

లాభ నష్టాలకు ఇది పువ్వుల బేరం కాదుగా?

సాహెబ్ కూడా వచ్చాడు.

ఏ కార్యం చెయ్యడం వల్ల మోక్షం లభిస్తుందో గ్రహించగలిగితే ఇన్ని రకాల సాధనలు, ఇన్ని రకాల పూజా పునస్కారాలకు అవసరం వుండేదే కాదేమో! ప్రపంచంలో ఎందరు వ్యక్తులున్నా ఒకరిని ఒకరు పోలనట్టుగానే మోక్షమార్గం కూడా ఎవరికి వారికి ప్రత్యేక మార్గం కావలసిందే. ఈ మార్గం అవలంబించూ మోక్షం లభిస్తుందని ఘంటాపథంగా చెప్పగలవాడు ఆ సర్వేశ్వరు డొక్కడే.

ఆయనను ఆరాధించడమే ముక్తి మార్గము!

'బహుశః కావచ్చును.'

అబ్బా భాయీస్ ఈసారి దగ్గరగానే వచ్చాడు. శ్రీచరణులుకూడా వచ్చారు.

నా ప్రశ్నకు సమాధానం అది కాదు

సమాధానం ఏనాడో మీ కబీరే చెప్పాడుగా.

ఏమని?

బెల్లం తిన్న మూగవాడిని రుచి ఎల్లా వుందని అడిగితే

అడిగితే ఏమన్నాడు?

మూగవాడేమంటాడో అదే అన్నాడు.

అప్పుడేమైయింది.

వాడి భాష ఎవరికి అర్థం అవుతుంది? రుచికి సంజ్ఞ ఏముంది?

అర్థమైంది స్వయం అనుభవమే ముక్తిమార్గాన్ని చూపిస్తుంది.

కావచ్చును.

శ్రీచరణులు అనంతలోకి చూస్తున్నారు అబ్బాభాయిస్ ఒక్కక్షణం సంశయించి

మెలి గా:

'ఐతే, ఇస్లామే శరణ్యమా?' అని అడిగాడు.

మతము వర్ణాశ్రమధర్మం సామాన్య గృహస్థులకు — ముముక్షులకు కాదు.

మరి...

నమ్మిన మార్గాన్నే నడు. తెలిసిన దైవాన్నే కొలు. మోక్షంకోసం వెతుక్కుంటూ వెళ్ళావా అది మరీచిక అవుతుంది. విస్మరించావా స్వయంపరమై వస్తుంది.

మరి నా కర్తవ్యం ?

నిరంతర మానవసేవ, అనుక్షణం దైవ స్మరణ.

అబ్బాస్‌ఖాన్ ఏం మాట్లాడలేదు. వంగి ఆయన పాదాలకు నమస్కరించ పోయాడు.

శ్రీ చరణులు ఉలిక్కిపడి 'అపచారం' అని అన్నారు.

'ఏందుకని?' అని ఎదురుప్రశ్న వచ్చింది.

'దైవ సన్నిధిలో యింకొక మానవుడికి నమస్కారం చెయ్యడం మహా అపచారం!'

విస్మయంతో ఒక అడుగు వెనక్కు వేసి 'ఇది లయం కాదుగా?' అని సాహెబ్ అన్నాడు.

ఈసారి నవ్వడం శ్రీవారి వంతు— దైవం లేనిచోటు వుందా.

చిలిపి పిల్లలలాగా యిద్దరూ ఒకసారి అల్లరిగా నవ్వుకున్నారు,

ఆనందానికి అవధి—దరహాసానికి క్షణం విశ్రాంతి. అంతలోనే ముద్ర గంభీరం. ఆలోచన తీవ్రం. అందుకు కారణం!

'ఎదురుగా నిలచిన అవతారం
విషణ్ణ విషాద వదనం.'

అలవాటుగా మనస్సు అభయ ముద్ర వహించింది. కాని ఏదో అపశకునం లీలగా హృదయానికి హెచ్చరిక చేసింది. అందరి లాగా ఆ మనిషి తనకు నమస్కరించలేదు. వరమిమ్మని అర్థించలేదు.

పరమ భక్తుడే తనకు అపచారం చేసిన వరమ కాళిలాగా వుంది.

అన్నిటికన్నా భయంకరం ఆమె మౌనం. శ్రీచరణులు క్షణం మౌనం వహించారు. అంతలోనే చిరునవ్వుతో 'అమ్మా ఏం కావాలి?' అని అడిగారు.

ఆ కాళీమాత వదనంలో జాజ్వంకన్నా కన్నీరు కనిపించింది.

# శ్రేయస్కామాగతిః

'ఉత్తమగతి!' ఆ వాక్కు అర్థించినట్టుగా లేదు. ఆజ్ఞలాగా వుంది.

నీ బోటి ఉత్తమ సతికి అది సులభమే

'తను దీవేన కోరింది యీ దీనురాలి కోసం కాదు' అంది ఆ కంఠం కన్నీరు మున్నీరు అవుతూ.

'ఎవరి కోసం?'

ఐన వారిచే వంచింపబడి క్రుంగి కృశించిన నా కన్నతల్లి కోసం.

'ఆ చిన్నారి ఎక్కడ వుంది?'

'ఇక్కడ మాత్రం లేదు. అక్కడికి చేర లేదు.'

శ్రీ చరణాల దృష్టి అందరిని దాటి అనంతాన్ని దాటి చూస్తోంది. ఈ భయంకర నిశ్శబ్దాన్ని ఛిన్నాభిన్నం చేస్తూ ఒక మాట వెలువడింది.

వైతరణి!

అదేమాట మార్మోగింది. వైతరణి!!

బ్రహ్మాండమైన నది. అందులో కొట్టుకు పోతున్న కోటాది జీవులు. ఒడ్డున నిలబడి ప్రశాంతంగా చూస్తున్న మంచు కన్నా తెల్లనైన కామధేనువు. చీకటి కన్నా నల్లని వేలాది కాకులు. పీడ కలలకన్నా భయంకరమైన పూర్వ స్మృతులు. కాటు వేయడానికి సిద్ధంగా వున్న తీరని కోరికల విష నాగులు. అంతస్థులు అంతస్థులుగా నిలబడి అలమటించి పోతున్న ఆత్మ. రుద్ర బ్రహ్మ స్వరూపాలు — ఆ నది ఒడ్డున. మల్లెకన్నా తెల్లనైన వలువలు. పరువమే యింకా ఎన్నో వసంతాలు మిగిలిన కన్నె వయస్సు. దేవతా సాదృశ్యమైన అపురూప స్వరూపం—కాని ఒకటే భేదం.

మాయమైన చిరునవ్వు.

మాయం కాని బ్రతుకు.

ఆ లోకం నుంచి యీ లోకానికి తిరిగి వచ్చిన తరువాత ఆయన వేసిన మొదటి ప్రశ్న—ఎల్లా జరిగింది యీ అన్యాయం?

సమాధానం వచ్చేలోపలే ఒక్కసారి గుండె ఝల్లు మన్నది.

కంచి వెళ్తున్న కథ తిరిగి వచ్చింది.

గతం వర్తమానమైంది. మనస్సు క్షణం పరాధీనం అయింది. అనాలోచితం! తనవల్ల ఏంత పొరబాటు జరిగింది!

ఆలోచన అక్కడే ఆగింది. అంతులేని దుఃఖం కలిగింది.

'సర్వసంగ పరిత్యాగి! నిస్సంగ బాధలకు అతీతులు — అన్న ఆ వరం యీ నాటితో చెల్లిపోయింది.— నేనూ అనే ఆలోచన నాది అనే అహంభావం వచ్చింది. ఇంత కన్న పతనం ఏం కావాలి?

స్వయం తీర్త్వా: పరాం స్తారయంతి!— జీవన సాగరంలో తానే మునకలు వేస్తూ వుంటే యితరులనేం దాటించగలడు?—

వరమివ్వడానికీ గాని శాపం యివ్వడానికి తనకు హక్కు లేదుగా!

మరి ఎందుకిల్లా జరిగింది?

సర్వజ్ఞుడననే అహంభావం వల్లనా?

ఎవరివల్ల యీ సమస్య పరిష్కారం అవుతుంది!

తనకెందుకు యీ అహంభావం!

అందుకేనా యీ శృంగ భంగం?

ఐనా అల్లా ఎందుకనకోవాలి? జరిగినది—పూర్వజన్మ కృతమని ప్రారబ్ధ వశమని ఎందుకు అనుకోకూడదు?

మనశ్శాంతికి ఏదో చెప్పుకుని సమాధానపరుచుకోవాలిగా!

అంతేనా?

అంతే కాబోలు!!

మళ్ళీ అదే జ్ఞానం. మళ్ళీ అదే అవివేకం!

ఏందరు భక్తులు తన దర్శనానికి రాలేదు! ఏందరు అమ్మవారి తీర్థ ప్రసాదాలు పొందలేదు. ఏందరు తన ఉపదేశాన్ని ఆలకించి భక్తిమార్గం మీద వడివడిగా ముందుకు సాగిపోలేదు?

ఏందుకిల్లా జరిగింది?

ఆ తన అంచనా సరియైనది కాక పోవటమా? లేకపోతే ఆ చిన్నదాని మూర్ఖత్వమే తను భక్తిగా అర్థం చేసుకున్నాడా!

తన అజ్ఞానం వల్ల ఒక అమాయకురాలు బలియైపోయిందా? సంఘం దృష్టిలో మానవుల దృష్టిలో కాక పోవచ్చు! దైవదృష్టిలో తను హంతకుడేమో!! — నాలుగు రోజులుగా ఆ కళ్యాణి భక్తి శ్రద్ధలు తనకు ముచ్చట కలిగించాయి. ఎంత ప్రయత్నం చేసినా లీలగా ఆ విగ్రహమే మనస్సులో మసలేది.

తులసి మాలలు తీసుకువచ్చి అమ్మవారి సన్నిధిలో వుంచుతూ, తనవంక చూసి ఆ మదక్షిణ మందహాసం చేస్తే, కుమార

స్వామిని పలకరించే ఈశ్వరి స్మరణకు వచ్చింది. అంతులేని ఫలాలు తనకు కానుకగా అర్పించి దీవించి తనను బుజ్జగించి నవ్వాడు, గణపతిని లాలించిన పర్వతరాజనందిని తన ఆలోచనలలో ఒకటికి పదిసార్లు మసలేది.

దశరాత్రులలో అష్టమినాటి రేయి దుర్గాభవానీ పూజచేస్తూవుంటే ఎవరిదో ఆకారం అమ్మవారిని కప్పివేస్తోంది. ఎవరిదో నిర్మల దరహాసం తపస్సుకు భంగం కలిగిస్తోంది.

తపోభంగమైనందుకు తనకు కోపం రాలేదు. సాక్షాత్కారమైన వ్యక్తిని పోల్చుకోలేక 'ఎవరమ్మా మీరు ?' అని ప్రశ్నించాడు.

గౌరీశంకర శిఖరంనుంచి ప్రవహించిన నీటి గలగల. చందమామకన్న చక్కనైన ఓంకార స్వరూపుని ప్రసన్న ముద్ర కనుల ఎదుట కనబడగానే, ముకుళిత హస్తాలతో, నత మస్తకంతో, హృదినిండిన ఆనందంతో, దిశలు నిండిన స్వరంతో— భవాని స్తోత్రం ఆలాపన చేస్తూవుంటే — ప్రకృతి అంతా నిశ్శబ్దం-ప్రపంచ మంతా నిశ్శబ్దం-భువన భాండమంతా నిశ్శబ్దం — ఈ ఆలాపనకు ఆలంబనగా లీలగా, లయగా నటరాజ నృత్యం.

ఒక్కసారి ఎటు చూసినా నిశ్శబ్దం! మనస్సుని చెదరకొట్టే నిశ్శబ్దం. నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ యుగ యుగాలుగ దాగిన ఎవరివో కన్నీళ్ళు. తపోభంగమైంది. ఆలోచనకు అంతరాయం వచ్చింది. ఆలాపన ఆగిపోయింది. నటరాజ నృత్యంలో అపశృతి పలికింది.

ఎంత కల !

కన్ను తెరచి చూస్తే మనస్సు తెరచి చూస్తే, ఎదుట నిలచింది. వెక్కి వెక్కి ఏడుస్తున్నది ఎవరు ?

అమ్మ అనిపించే అమ్మ. హృదయం గుర్తించినా మనస్సు గుర్తించలేక

'ఎందుకమ్మా విలపిస్తున్నావు ?' అని ప్రశ్నించారు.

నాకు తమరు నమస్కారం చేస్తున్నారు. ఇంతకన్నా అపచార మేముంది ?

మళ్ళీ ప్రశ్న వచ్చింది 'ఎవరమ్మా నువ్వు ?'

'నేను గౌరిని' అని అన్నది.

'ఈశ్వరుని ఇల్లాలువేగా ?'

'కాదు, మానవిని. తమ భక్తురాలిని.'

'భగవంతుడికేనమ్మా మనమంతా భక్తులం. నువ్వు నాకు తల్లివి జగన్మాతవు'

నమస్కారం చేస్తూనే కిలకిలా నవ్వింది చిన్నది. దగ్గరున్న పెద్దలు 'అపచారం' అని అన్నారు.

ఆ క్షణంలో తనను ఏదైనా శక్తి అల్లా ప్రేరేపించిందేమో ? తను నిత్యం కుంకుమ పూజలో వినియోగించే బంగారు విగ్రహాన్ని ఆ చిన్నదాని చేతిలో పెడుతూ

'ఈనాటినుంచి ఇదే నీ సర్వస్వం తల్లీ' అని అన్నారు.

ఆనందంతో హృదయం మైమరచిపోగా గాలిలో తేలిపోతూ భక్తురాలు కనుచాటైపోయింది.

ఆ సీమనుంచి తాము యింకొక సీమకు తరలిపోగానే తమ మనస్సుకే దూరమైయింది. స్మృతిలో అస్పష్టమైయింది.

విగ్రహం లేనంత మాత్రాన అమ్మవారి పూజకేం అంతరాయం కలగలేదు, భక్తుల మనస్సులోని మాట ఆవిడకు ఎప్పుడూ ఎరికేగదా ! తను చేరిన చోటుకు తనకంటే ముందుగానే చేరుకుంది. భక్తిసంపన్నులైన భక్తులు తమకు అర్పించిన మొదటి కానుక.

అంబికాదేవి విగ్రహం. విగ్రహం అదే! రూపం అదే! కాని ఏదో రవ్వంత భేదం... మూర్తి ప్రసన్న వదనంలో చిన్నపోతున్న అప్రసన్నం.

ఆరోజు ఎంత ప్రయత్నించినా పూజవేళలో మనస్సు నిశ్చలంగా నిలవడం లేదు. ఎన్నో ప్రశ్నలు. ఎన్నో సమాధానాలు. ఎవరివో అస్పష్ట కర్కశ స్వరాలు, ఎవరివో వినబడని కన్నీళ్ళు. ఏవో అపశృతులు. ఏవో పీడకలలు. కల చెదిరింది. గుండె ఝల్లు మన్నది.

అమ్మవారి దగ్గర దీపం కొండ ఎక్కింది — అప్రయత్నంగా హృదయం పలికింది అమ్మా గౌరీ!

ఇన్ని సంవత్సరాలుగా తను ఏ ప్రదేశంలో రెండవసారి పర్యటన చెయ్యలేదు. ఏ గృహస్థు దగ్గరా రెండవసారి భిక్ష స్వీకరించలేదు.

కారణం?

జడభరతుడి కథ అనుక్షణం గుర్తుకు రావటం. ఈసారి వ్రతభంగం అయింది నియమ విరుద్ధంగా నిర్ణయం జరిగింది.

'శంకరా!' అని శిష్యుడిని పిలిచారు అమ్మను చూపి 'ఎంతకాలం అయిందో?' అని ప్రశ్నించారు.

ఆ ప్రశ్నకు సమాధానం ఆది శంకరుడే సమాధానం చెప్పాడు.

పదహారు నెలలు:

భిక్షార్థులమై తిరిగి వేంచేస్తున్నామని



వార్త వంపించాడి.

వాయువేగంగా వార్త వెళ్లింది; మునో వేకంగా, పరివార సమేతంగా ఆ సీమ పొలిమేర చేరేసరికి తమకు సుస్వాగతం యివ్వడానికి ఆబాలగోపాలం తరలి రాలేదు. పూర్ణకుంభాలతో ఎదురు రాలేదు. స్వస్తి వచనాలతో సుస్వాగతం పలక లేదు.

వారి మౌనం వారి వదనాలలో గాంభీర్యం చెప్పే సందేశం తనకు తెలుసు. తను రాక యీ సీమవారికి సంతోషాన్ని యివ్వదు.

ఈ పల్లెలో తమకు భిక్ష లభించదు.

ఎందుకని! ఎందుకని!

అశనిపాతం లాగా సమాధానం వచ్చింది — గౌరి మరణించింది!! సుఖ దుఃఖాలకు అతీతమైన ఆ హృదయం పామరునిలాగా శోకించింది.

ఎప్పుడు? ఎప్పుడు జరిగిందీ ఘోరం.

ముప్పది ప్రొద్దులకు ముందు.

ఎల్లా జరిగింది యీ ఘోరం??

సమాధానం చెప్పటానికి జనం శంకించారు. వారి మౌనం వెయ్యి గొంతుకలలో తన నేరాన్ని ముల్లోకాలా చాటిచెబుతోంది.

'ఈనాటినుంచి నీ సర్వస్వం ఇదే!!' యీ మాట మనస్సులో మెరుపులా మెరిసింది. తను ఇచ్చిన అపురూపమైన వరం అంతులేని శాపంగా మారింది.

దుఃఖం వెనువెంట అంతులేని పశ్చాత్తాపం కలిగింది — ఇన్ని జన్మల దీక్ష, తపస్సు వ్యర్థమైపోయింది— తను ఇతరులకన్న అధికుడనని, మానవులకు వరప్రదానం చెయ్యగల దైవతుల్యుడనని అహంభావం, అజ్ఞానం ఆవరించుకున్న తను యీనాడు జ్ఞానభ్రష్టుడే కాదు, స్థానభ్రష్టుడు కూడా!!

పర్వత శిఖరంనుంచి దొర్లిన రాయి నేలను దాటుకుంటూ అగాధంలో పడిపోయింది. ఆ శిలను తిరిగి శిఖరంమీదకు చేర్చగల శక్తి తనకు వుందా?

లేదని తెలుసుకోగల జ్ఞానం మాత్రం మిగిలింది.

భార్యకు భర్తకన్న వేరే యింకొక సర్వస్వం, యింకొక ఆరాధ్య దైవం కల్పించిన తను ఎంత అవివేకి?

దైవం, భర్త వేరని భావించి, భర్తని విడనాడి యీ దైవాన్ని కొలిచి, తనకూ

# భ్రష్టస్య కా వా గతిః

తనవారలకూ దూరమై జనవారికి శత్రువై శాంతిని సుఖాన్ని కోల్పోయి — మందులేని యీ వ్యాధికి మరణమే శరణమని నమ్మిన అమాయకురాలి మరణానికి కారణం — కారకులు ఎవరు?

ఈ సర్వసంగ పరిత్యాగి!!

తనువును త్యజించినా యీ బ్రహ్మహత్యా పాతకం దూరమవుతుందా? తెలియక చేసిన యీ నేరానికి విముక్తి కల్గుతుందా?

'ఈనాటి పూజ?' అని ఎవరో ప్రశ్నగా మనవి చేశారు.

ఆలోచనలకు అంతరాయం కలిగింది. 'సమీప గ్రామం' అని నిర్ణయించారు.

పరివారం ప్రయాణానికి సన్నద్ధమైయింది.

'మరి భిక్ష?' అంటూ ఇంకొక మనవి వచ్చింది.

మనస్సు క్షణం సంకోచించింది. నిత్యం భిక్షార్థులమే. యాచనకు, ఎన్నడూ లేని సంకోచం యీనాడు ఎందుకు కలుగుతోంది? దైవనిర్ణయం ఎట్లావుంటే అల్లా జరుగుతుంది.'

కనుసన్నలలో మెలిగే పరివారం మనస్సు గ్రహించి ముందుకు సాగిపోయింది.

కన్నీరు వినిపించింది. దిగ్మండలాలు దాటిన ఆలోచనలు బెదిరిన యీ మౌనంతో యీ భయంకర సత్యాన్ని తనకు మళ్ళీ గుర్తు చేశాయి.

తల ఎత్తిన అహంభావం అన్నది.

'జాతస్య మరణ ధృవం!!'

వ్యథ నిండిన హృదయం ప్రార్థించింది.

'త్వమేవ శరణం! త్వమేవ శరణం.'

ఆ శోక మూర్తి వంక చూసి అభయముద్ర వహించారు. 'ఆ దేవతకు ఉత్తమ గతి తప్పక కలుగుతుంది' అని అన్నారు.

'ఎట్లా స్వామి! స్వజనమంతా వుండి కూడా నా తల్లి దిక్కులేనిదైంది'

అమెను చేపట్టిన వాడు.

తమ ఎదుటకు రావడానికి నిరాకరిస్తున్నాడు.

ఎందుకని?

తనుబోటి వారి యెడల అంతులేని ద్వేషంతో.

కారణం?

తమరే గ్రహించాలి

శ్రీ చరణులు అనంతంలోకి చూస్తున్నారు. పరిపరివిధాల ప్రయత్నించేసినా మనస్సు గ్రహించలేక పోయింది.

హరి హరులు తమకు అభేద్యులు కావచ్చును. ముముక్షువులకు సులభ సాధ్యులు కావచ్చును. కాని కామ, క్రోధ లోభ మద మాత్సర్యాలలో సతమతమైయ్యే సామాన్య మానవులకు ఇంతటి విశాల దృక్పథం ఎల్లా సాధ్యం?

అందుకనేనా యీ అన్యాయం జరిగింది! అబ్బాభాటూస్ వంక తిరిగి 'ఆ తల్లికి ఉత్తమగతి కలిపించమని మనం ప్రార్థించుదాం' అని అన్నారు.

దైవమిచ్చినంత సులభంగా మానవులు వరమిస్తారేమో!

యత్ర కురుతేయది న సిద్ధ్యతి...

దోషాదోష విచారణ కాదు — ప్రస్తుత కర్తవ్యం. సమస్యా పరిష్కారం.

పాదం ముందుకు సాగింది. పరివారం వెంట నడిచింది. ఆబాలగోపాలం అనుసరించారు. వారి ఆంతర్యం గ్రహించి కాబోలు అంతా నిశ్శబ్దం.

మేనా వచ్చింది; వెనువెంట గజవాహనం కూడా వచ్చింది— కాని వారి మౌనం చెప్పిన మాట సోదాహరణంగానే వెడదాం!

ప్రజావాహిని వెల్లువలాగా సాగింది; పొలిమేర దాటి పరసీమ చేరి, శ్రీమంతుల మూడంతస్థుల సౌధంముందు ఆగింది.

వారి రాకకు స్వాగతవచనం— తల్లి లేక తండ్రిచే నిర్లక్ష్యం చేయబడ్డ పసివాడి ఆక్రందనం.

ఒక్కొక్క అంతస్థే దిగి క్రిందకు వచ్చి నిలబడాడు గౌరినాథుడు. అతని మాటలో వెయ్యి నుంది తక్షకులున్నారు. సమస్త లోకాలు భస్మంచెయ్యగల ద్వేషం వుంది.

మళ్ళీ ఎందుకువచ్చారు యీ సీమకు?

ఇతరులకోసం యాచించడానికి.

సమస్తం పోగొట్టుకుని సర్వవిధాల నాశనమైన నాదగ్గరేముంది ఇవ్వడానికి?

ప్రేమించగల హృదయం వుంది. క్షమించగల స్థోమత వుంది.

వాటిని పగవారికోసం వెచ్చ బెట్టే మూర్ఖుడిని మాత్రం కాదు.

కాదని తెలుసు అందుకనే.

మీరు అడగబోయేది చెప్పబోయేది సాక్షి

తెలుసు.

మీరు వేయబోయే ప్రశ్నలు నాకు తెలుసు.

సమాధానం కాదు నేను అర్థించేది. ఆత్మీయుల ఆత్మకు ఉత్తమగతి కనిపించటం మన ముఖ్య కర్తవ్యం ... అని మనవి చేయడమే.

ఎవరు ఆత్మీయులు? ధర్మ అర్ధ కామ మోక్షముల నన్ను తప్పి చరించనని. అగ్ని సాక్షిగా తాళికట్టిన భర్తను కాదని — కడుపున పుట్టిన బిడ్డను కాదని — భర్త మతం వేరని తన మతం వేరని—

సంసార బాధ్యతలను అనుబంధాలను అర్థం చేసుకోలేని ఒక సన్యాసి యిచ్చిన బంగారు విగ్రహమే సర్వస్వమని ప్రచారం చేసి,

మా వంశ మర్యాదను కూలద్రోసి, మా అందరి బ్రతుకూ నగుబాట్లు చేసిన ఆ మనిషి, మమకారాలని, మనస్సుని త్రెంచి వేసుకుని యుగయుగాల బ్రతుకుని ఒక క్షణములోనె తెల్లవార్చుకున్న మనిషిని ...

...తప్పులన్నీ క్షమించి నీ ఇల్లాలికి ఉత్తమ గతి కలిగించమని ప్రార్థన. ప్రార్థనలకు కరగడానికి నేను దైవాన్ని కాదు. నేను క్షమించను.

ఆవిడని క్షమించవద్దు. గ్రహ్యం తెలిసిన తరువాత నీ బిడ్డకు నిజం తెలుస్తే, తల్లికి ఉత్తమ గతి కల్పించని తండ్రివని ఆ పసివాడి ఎదుట ఎవరైనా నిన్ను అడిగితే పోనుకుంటే?

నన్ను నిందించే వారి సంఖ్య యింకొక అంకె పెరుగుతుంది...

అంజలి ఘటియించి ప్రార్థిస్తున్నాను. నమ్మకల్ని దిక్కులేకుండా చేసి — తన స్వార్థం కోసం ఆయువు తీరకుండానే అవతారం చాలించిన ఆ వ్యక్తి ఆత్మ పశ్చాత్తాపంతో తపించి తపించి ఆయువు తీరి మూఢనమ్మకాలలో నుంచి మనస్సు విముక్తి పొంది తనకు తానుగా వైతరణి దాటవలసిందే. ఈ ప్రయత్నంలో నేను చేయూత నివ్వను. ఆ ఆత్మకు శాంతిని ప్రసాదించమని నేను ప్రార్థించను.

అదేనా నీ నిర్ణయం?

అదే నా నిర్ణయం.

సముద్ర మథనంలో హాలాహలమే లభించింది. అమృతం లభించలేదు, పశ్చాత్తాపం వెంటాడగా పరివారంతో తిరిగి వచ్చారు.

రాత్రి అంతా ఒంటరిగా మౌనంగా అమ్మవారి సన్నిధిలో గడిపారు. ఉదయ భాస్కరుడు వస్తున్నాడని కాబోలు తారలన్నీ పారిపోయాయి. చందమామ కనుమాటై యింది. పక్షిగణం కలకలమని బెదిరింది.

చిన్న కృష్ణయ్య నిదురలేచే వేళ అయింది.

నిదుర లేని శ్రీ చరణులు అమ్మవారి సన్నిధి నుంచే చంద్రచూడా! అని పిలిచారు.

'స్వామీ!'

ఈ నాటి నుంచి పీఠాధిపతివి నువ్వు స్వామీ!!

'కాదనకు అది అంద ఆజ్ఞ'

అమ్మవారి విగ్రహానికి సాష్టాంగ ప్రణామం చేసి చంద్రచూడుడు శ్రీవారికి నమస్కరించాడు.

'తమ ఆజ్ఞ' అని అన్నాడు.

ఈ మాటలు వారిద్దరి మధ్యనే జరిగినా యీ శుభవార్త అశేష జనానికి ఎల్లా తెలిసిందో ఏమో!! సాయంకాలం అయ్యేసరికి నేల యీనినట్టు జనం. నూతన పీఠాధిపతిని చూడగానే జయజయనాదాలతో దిక్కులు పిక్కటిల్లినాయి.

ఎటు చూసినా ఎటు విన్నా వేదనాదం.

అందరి మనస్సులలో మెదలిని ఆశ్చర్యం ప్రశ్నపరంపర ఇంత అకస్మాత్తుగా శ్రీ చరణులు పదవీ విరమణ ఎందుకు చేశారు?

మరునాడు అంతకన్న ఆశ్చర్యకరమైన విషయం

శ్రీ చరణులు తిరిగి ఉపనయనం చేసుకుంటున్నారు. క్రొత్త స్వాములవారు బ్రహ్మోపదేశం చేస్తారుట.

ఈ విడ్డూరంతో ఏం లోకప్రళయం వస్తుందోనని జనం భీతి చెందారు. మనస్సు నిలవక ఒకరిద్దరు అబ్బాభాటూన్‌ని అడిగి చూశారు.

అక్కడా సమాధానం శూన్యం.

ఉపనయనం. వేదపండితుల ఆశీర్వచనంతో, యథావిధిగా జరిగింది.

ఆ వటువు ముందుకు బయలుదేరాడు. వెంట రమ్మని అబ్బాభాటూన్‌కు ఆజ్ఞ అయింది.

చంద్ర చూడుడు నెమ్మదిగా ప్రార్థిస్తూ 'నేను కూడా తనువెంట' అంటూ మనవి చేసుకోపోయాడు.

శ్రీ చరణులు వారిస్తూ 'మన కలయిక అక్కడే' అని అన్నాడు.

ఎక్కడ?

శివసన్నిధిలో,

అంతవరకూ?

జగన్మాతకు ఆత్మసమర్పణ.



## భ్రష్టస్యకావాగతిః

శిష్యవర్గం కకుచాట్పయింది: శిలా ప్రతిమలులాగా ప్రజానీకం నిలచిపోయింది.

అబ్బాభాటూస్ ఒకేవొక ప్రశ్నవేశాడు.

ఈ మ్లేచ్ఛుడు మీ దగ్గర వుండ వచ్చునా ?

కులమతాలు, వర్ణాశమాలు శరీరానికి కాని ఆత్మకు కావు, మనం ఇద్దరం యిప్పుడు ఒకటే.

పది దినాలు ఇద్దరూ కలిసే వున్నారు:

యధావిధిగా శాస్త్రరీత్యా అపరకర్మలు విలక్షణంగా జరిగాయి. సక్రమంగా దానాలన్నీ యిచ్చారు.

చంద్రుడంతటి వాడిలోనే మచ్చవుండగా మానవు లెంత ?

అహంభావం అరికట్టుకోలేక మొదటి రోజునే అడిగాడు— ధర్మ, అర్థ, కామ, మోక్షములలో గౌరిని తప్ప భరించనని, ఏడడుగులు కలిసి నడిచి అగ్నిసాక్షిగా దైవ సాక్షిగా ప్రాణిగ్రహణంచేసిన చిన్నవాడు — అక్కసుగ అడిగిన ప్రశ్న, 'మాకు జరిగిన అవమానం చాలదనా మీరు ఈ పని చేస్తున్నారు ?

తల్లికి ఉత్తమగతి కలిపించటం తనయుడి ధర్మం.

గౌరి ?

ఆ పరమసాధ్వి నాకు జన్మజన్మలతల్లి. ఎన్నిజన్మలెత్తినా యెన్ని అవతారాలెత్తినా ఆవిడకు నేను కన్నబిడ్డనే—

మరి నేను?

మనస్సులు కలయకపోయినా మిత్రులం.

అది మీమాట.

కాలం కడిస్తే అది మనమాటే — అవుతుంది.

అంతేనా?

అంతే!!

పదమూడవనాడు బ్రాహ్మణ ఆశీర్వచనం జరిగింది. ఏ తనయుడు తన తల్లిని ఇంత శ్రద్ధగా కొలవలేదని ఒకటికి పదిసార్లు కొనియాడారు.

సాయంకాలం అయింది. అంతా తరలిపోయారు. అంతులేని మౌనంతో మిత్రులిద్దరూ మిగిలిపోయారు.

మానవుల సుఖదుఃఖాలకు అతీతమైన చందమామ ప్రపంచకాన్ని తన సమ్మోహనాస్త్రంతో బంధించివేసింది.

ఆ చల్లని వెలుగునుచూసి 'అమ్మా'అని శ్రీ చరణులు పిలిచారు.

'నాయనా !' అని గౌరి కంఠం పలికింది.

'ఎక్కడున్నవమ్మా' అని ప్రశ్నించారు.

"స్మృతులు దూరమౌతున్నాయి. బాధలు దూరమౌతున్నాయి."

సంతృప్తేనా ?

చివరకు మిగిలింది ఒకటే కోరిక.

ఏమిటమ్మా అది?

ఏ తనయుడు చేయని త్యాగం నువ్వు చేశావు నాయనా. భగవంతుడిని నేను కోరేది ఒకటే, మళ్ళీ మానవజన్మకలిగి నీ యింట పుట్టాలని

ఎక్కడున్నావమ్మా ఇప్పుడు.

వైతరణి నడుమ.

'అమ్మా! అమ్మా!!' అంటూ శ్రీ చరణులు ఆక్రోశించారు.

'స్వామి! స్వామి!' అంటూ అబ్బాభాటూస్ పిలిచాడు.

మరునాడు నదీతీరంలో శ్రీ చరణులు కనిపించలేదు. అబ్బాభాటూస్ కనిపించలేదు.

అంతా నిశ్శబ్దం.

అనుష్ఠానంలో కూర్చున్న చంద్రచూడశాస్త్రివారికి ధ్యానభంగమైంది. మంత్రోచ్చారణ సాగలేదు. మనస్సు చంచలమైపోయింది. అమ్మవారి వంకనే చూస్తూ కూర్చున్నాడు.

ఆ సందేశం అతని చెవులకు వినిపించలేదు. కాని మనస్సుకు హత్తుకునిపోయింది.

'నాయనా చంద్రచూడా ! జ్ఞానేశ్వర్ తల్లిదండ్రులకు వచ్చిన సమస్యే నాకు వచ్చింది నాయనా!!

అన్ని సమస్యలు పరిష్కరించగల సర్వేశ్వరుడిని వెదుక్కుంటూ ఎక్కడికో ఎక్కడికో ఎక్కడికో వెళ్ళిపోతున్నాను.

ఈ అహంభావానికి, వ్యామోహత్వం, విస్మృతులు ప్రసాదించమని అంబను ప్రార్థించు. తనయుడిమాట కాదనదు ఆ తల్లి!! ●



**మేషం:**—వృత్తిలో యిచ్చిన విశేషాలు సమ్మోదం తగదు. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారంమధ్యలో ఉద్యోగం లో గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఇతరులతో కలసి చేసే వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**వృషభం:**—మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**మిధునం:**—వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. పోటీ వారిలో గౌరవం బాగుంటుంది.

**కర్కాటకం:**—అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహ:**—ఉద్యోగంలో శ్రమకలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కన్య:**—ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాల్లో ఆదాయం బాగుంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సు కొంటారు.

**తుల:**—వృత్తిలో పోటీవారిపోటీ పెరుగుతుంది. ఇతరులనిమిత్తం శ్రమకు గురికాగలరు. సాంఘిక కార్యక్రమాలు బాగుంటాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వారంఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును.

# వారఫలం

## 20-7-1973 శుక్రవారం మొదలు 26-7-1973 గురువారం వరకు

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం:**—మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది.అనవసరమైన వ్యయం జరుగుతుంది. వారంఆఖరులో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**ధనుస్సు:**—మీ కార్యక్రమాల్లో ఆడావుడి అధికంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం మధ్యలో వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో యితరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు.

స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. పోటీ వారితో కొద్ది ప్రతివాదాలు తగవు.

**మకరం:**—వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీకు ముమ్మందు లాభించగల వ్యవహారాలో అభివృద్ధిని సాధించగలరు. మిత్రులసహాయం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**కుంభం:**—ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో పోటీవారిపోటీ తగ్గుతుంది. వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సు కొంటారు.

**మీనం:**—వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది.అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

—మహేష్




### జరిగిన కథ

నిలయ చెల్లెలు లోక. రోగంతో తీసుకుంటున్న ముసలితండ్రి ఒకడున్నాడు. సంసార బాధ్యత అంతా నిలయదే. ఆమె ఒక ఆఫీసులో పని చేస్తున్నది. ఆ ఆఫీసులోనే పని చేస్తున్న భాస్కర్రావు ఆమెని పెళ్ళాడతానన్నాడు. కాని, కుటుంబ పరిస్థితి దృష్ట్యా నిలయ అంగీకరించలేదు. లోకకి సినిమాలంటే పిచ్చి. ఆమెకి తగినవాడే మోహన్. సినిమాల్లో చేర్పిస్తానని లోకని మద్రాసు తీసుకు వచ్చాడు మోహన్. నిలయా మధూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు. కాని మధు తల్లి అందుకు సమ్మతించలేదు. వేరే సంబంధం గురించి చెప్పింది. మధు తల్లడిల్లిపోయాడు. లోక గర్భవతి అయ్యాక మోసంచేసి వెళ్ళిపోయాడు మోహన్. జయ ఆమెకి మంచి స్నేహితురాలు.

## 8

సాయంత్రం పరదా కట్టిన రిక్షాలో ఇద్దరాడవాళ్ళు వచ్చారు మా ఇంటికి. ఇంట్లో నే వొక్కదాన్నే ఉన్నాను. తలుపు తీసిన నేను ఆ కొత్తవాళ్ళిద్దర్నీ చూసి ఆశ్చర్యపోయిన మాట నిజం, మా ఇంటికొచ్చేవాళ్ళెవరున్నారు... పైగా పరిచయం లేనివాళ్ళు...తెల్లబోయి చూస్తున్న నన్ను తప్పించుకుని వాళ్ళిద్దరూ లోపలికి నడిచారు. నా వంక అదోలా చూస్తూ 'మీ నాన్న ఎన్ని గంటలకొస్తారు?' అంది వాళ్ళల్లో ఒకావిడ. ఆవిడకి ముప్ఫయ్యేళ్ళుంటాయి. చామన చాయగా ఉన్నా ముఖంలో ఆకర్షణ ఉంది. దట్టంగా పౌడరద్దుకుంది. తెల్లపూల వల్బుటెవాయిల్ చీర కట్టుకుంది, నేను సమాధానం చెప్పే లోపలే రెండో ఆవిడ 'ఎవరో ఇద్దరాడాళ్ళు వచ్చి వెళ్ళారు అంటూ మీ నాన్న దగ్గర అనకు. జాగర్త' అంటూ కళ్ళతో బెదిరింపుగా చూసింది నావంక. ఆవిడకి ఏభై పైనే ఉంటుంది వయసు. మొహంలో ముసలిరూపు కనపడుతున్నా వేషంలో ముసలితనం లేదు. అంతలా అలంకరించుకుంది. ఇద్దరూ ఇల్లంతా తిరిగి చూశారు. పాతకొంపే అయినా విశాలంగా బానే ఉంది. రెండుభాగాలు చేసి అద్దెకిస్తే నెలకి వందా కళ్ళు చూడొచ్చు. అంటూ ఇద్దరూ ముఖాలు చాటు చేసి చెప్పుకున్నారు. వాళ్ళుండగానే మా పనిమనిషి వెంకమ్మ వచ్చింది. వాళ్ళని చూసి లోపలికి రాకుండా తలుపవతలే నిలబడి పోయింది. 'ఇంక అలస్యం చెయ్యకు నాగవేణీ! తప్పకుండా ఈ ఇల్లు రాయించుకో మాయ చేసో, మంత్రం వేసో' అంది మెల్లగా ఆ ముసలావిడ. నాకా మాటలు వినపడ్డాయి. కాని మొదలూ చివరా ఏమీ అర్థం కానట్టుగా ఉంది నా పరిస్థితి. తర్వాత వాళ్ళిద్దరూ వెళ్ళి పోయాక వెంకమ్మ లోపలికొచ్చింది. 'తమలాటోళ్ళకి ఎలాటి గొడవొచ్చి పడిందమ్మాయిగారూ' అంది ఎంతో జాలిగా. 'ఏమిటే' అన్నాను చిరాగ్గా. అసలే, తెలియని వాళ్ళెవరో రావటం, అర్థం కాని సంభాషణ జరిపి ఎంత హడావిడిగా వొచ్చారో అంత హడావిడిగానూ వెళ్ళడం... దాంతో బుర్ర వేడెక్కిన నేను చిరాకు చూపెట్టాను. 'వాళ్ళిద్దరూ – తల్లీకూతుళ్ళండి. నూట్యానికి వేసంలో అక్కాచెల్లెళ్ళలా గుంటారు. ఇప్పుడా తల్లికి యాపారం లేదు. ఏనాడో అయిందది యాపారం వడిపోయి. ఇప్పుడంతా ఆ కూతురే ఇల్లు నడిపేది, అదేమో... అదేలెండి... నా నోటితో ఎట్టా సెప్పేది?' అంటూ ఆగిపోయిందది. నేను అసలు సంగతేవిటో చెప్పమని మరీ మరీ బలవంత పెట్టడంతో బాధపడుతూ అది చెప్పింది 'శనిలా అయ్యగార్ని పట్టుకుందమ్మా ఆ నాగవేణి దెయ్యం. మాయలమారి. ఇప్పుడీ ఇంటిమీద దాని కన్ను పడ్డట్టుంది తల్లీ! అయ్యగార్ని మాయసేసి ఈ ఇల్లు రాయించుకుందామని సూస్తున్నట్టుంది. పసిబిడ్డలు తల్లి లేని బిడ్డలు. మీకి నీడ కూడా లేకుండా సేద్దామని సూస్తున్నట్టుంది.' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకుందది మామీద జాలితో. నా గుండె బద్దలయిందా మాటలు వింటూనే. ఆ నాగవేణిదే పూర్తిగా తప్పని నాకనిపించలేదు, రెండు చేతులూ కలిస్తేనే కదా చప్పుడయ్యేది. నాన్నని వల్లో వేసుకోడం ఆవిడ తప్పయితే అటువంటివాళ్ళ గడపతొక్కి వాళ్ళకి లొంగిపోయి, ఆడమన్నట్టల్లా ఆడే నాన్నది తప్పెందుకవదూ! నాన్న మీదే నాకు విపరీతంగా కోపం వచ్చింది. అయితేమాత్రం నేనేం చెయ్యగలను? అనుకోవాల్సి. నాన్నతో ఈ విషయం గురించి యెలా మాట్లాడగలను? సిగ్గువిడిచి కూతురు కన్న తండ్రితో మాట్లాడే విషయమా ఇది? చేసేదిలేక, ముందుముందు మాకేగతి పట్టబోతోందోనన్న భయం, బాధతో ఇలా ఏడుస్తూ కూర్చున్నాను. 'ఇంతకన్నా చేయగలిగిందేంలేదు గనక! నాన్న మొహం చూడాలన్నా, ఆయనతో మాట్లాడాలన్నా నాకు చాలా అసహ్యంగా ఉంది.' చెప్పడం ముగించింది జయ. ఏదో కథ వింటున్నట్టు కదలిక లేకుండా కూర్చున్న నిలయ చిన్నగా నిట్టూర్చింది. 'నాకంటే అభాగ్యులెవరూ ఉండరనే వెర్రి భ్రమలో ఉన్నాను. నా ఊహ తప్పని బుజువైంది. మీ ఆరుగుర్లో ఏ ఒకళ్ళూ ఒడ్డుకి చేరినవాళ్ళు లేరు. పెళ్ళికాకపోయినా కనీసం ఏదో కాస్త చదువైనా ఉండి ఉద్యోగం చేసుకుంటూ సొంత కాళ్ళమీద నిలబడగలిగే స్థితిలో

తన్నా లేవు నువ్వు.'

'ఏం ముంచుకొచ్చినా మా గతి అధో గతే...'

మృదువుగా జయ నోటిమీద తనచేతి నుంచింది నిలయ.

'వొద్దు. అలా అనకు.'

'హు! ఇందులో లేనిదేం ఉంది? ఉన్న మాటే' అన్నాను.

ఒక్క క్షణం విశ్శబ్దంలో కరిగిపోయింది

'ఏం చెయ్యాలీ పరిస్థితిలో? నాన్నతో ఈ విషయం గురించి ఎలా మాట్లాడ గలను? అమ్మ తనతోపాటూ నన్నుకూడా తీసికెళ్ళిపోతే ఎంత బాగుండేది?'

'నువ్వలా అంటే ఎలా జయా? తక్కిన వాళ్ళకి ని అండకూడా లేకపోతే ఎలా? నీకంటే చిన్నవాళ్ళు. దీనికేదో పరిష్కారం ఆలోచించాలి గానీ...' నిలయ బుర్ర ఆలో చనతో వేడెక్కి పోయింది. చివరికి మెల్లిగా అంది 'ప్రస్తుతం మీ నాన్నగారితో ఏదో ఒక కారణం చెప్పేస్తాను. నువ్వేమీ మాట్లాడకుండా ఊరుకో. ఈ సమస్యకి పరిష్కారం ఈ రాత్రంతా ఆలోచిస్తాను. మళ్ళీ రేపు సాయంత్రం వచ్చి నీ చెప్తాను. సరేనా?'

'అనవసరంగా మీకు శ్రమ కలిగిస్తున్నా నేమో! మీ ఋణం ఎలా తీర్చుకోగలను?'

'శ్రమా లేదు గిమా లేదు. నువ్వు నన్ను 'మీరు' అనడం మానేసి 'నువ్వు' అంటే ఋణం తీర్చుకున్నదాని వవుతావు' నవ్వింది నిలయ. ఒక్క నిమిషమాగి మళ్ళీ తనే అంది 'నా అన్నవాళ్ళు లేని ఒంటరి దాన్ని నేను ఎవరికీ ఉపయోగపడని బ్రతుకు నాది. నావల్ల మీకేదైనా ఉపకారం అంటూ జరిగితే అంతకన్నా నాక్కావల్సిందేముంది? అంటూనే ఆ గదిలోంచి బయటకి వొచ్చింది నిలయ వరండాలో పచార్లు చేస్తున్న రామనాథంగారు నిలయని చూస్తూ చటుక్కున ఆగిపోయి ఆత్రుతగా చూశారు.

'మరేం కంగారు పడకండి. సాయంత్రం ఎవడో తుంటరివెధవ, జయ వీధిలో నిల్చు న్నప్పుడు ఏదో వాగాడుట. అందుకు చాలా బాధపడుతోంది జయ.'

కళ్ళెర్రజేశారు రామనాథంగారు. 'అసలు వీధిలోకిపోయి నిలబడాల్సిన అవసరం దీని కేమిటంట? కొంపకి అప్రతిష్ఠ తెచ్చి



పెడుతుంది కాబోలు' కోపంగా జయ ఉన్న గదిలోకి వడవబోయారు

నవ్వొచ్చింది నిలయకి. కూతురు వీధి గుమ్మంలో నిలబడితేనే కొంపకి అప్రతిష్ఠ. తనెన్ని ఘోరమైన పనులయినా చేయచ్చు. చటుక్కున గుమ్మాని కడ్డంగా నిలబడి అప్రయత్నంగా అతన చెయ్యి పుచ్చుకని అంది ' యవేమీ అవొద్దు. అంటే నామీద ఒట్టే.'

రామనాథంగారి ఉద్రేకం, కోపం చల్ల బడ్డాయి ఒక్కసారిగా. ఒంట్లో విద్యుత్తేదో సోకినట్టయింది నిలయ చేతిస్పర్శతో. ఆవె చేయి ఆ చేతిలో అలాగే ఎంతోసేపుండి

# వీడిన మబ్బులు

పోతే బాగుండుననిపించిందాయనకి. మెల్లిగా ఆ చేతినొదిలి, ఆయన మొహంలో భావాలు కనిపెడుతూ వెనక్కి తిరిగింది నిలయ. 'మళ్ళీ రేపు సాయంత్రం వొస్తాను జయా!' అంటూ బయటకి నడిచింది.

రామనాథంగారి మనసు తెలియని ఆనందంతో గంతులు వేసింది.

'మళ్ళీ రేపొస్తుంది నిలయ' ఈ ఆలోచనతో ఒళ్ళు పులకించినట్టయింది. నిలయకి చేరువ కాబోతున్నాడు తను... చిన్నప్పటి తన కోరిక నెరవేరబోతోంది... నిలయ తనని కరుణించే రోజులు త్వరలోనే రావచ్చు. ఇదంతా జయవల్లేకదా సంభవించింది. ఉన్నట్టుండి జయమీద ఎక్కడలేని ప్రేమా పుట్టుకొచ్చిందాయనకి. ఎంతో ప్రేమ్యంగా పిల్చారు 'జయా!'

భయంభయంగా వొచ్చి ఎదురుగా నిల్చుంది జయ. ఇందాక కొత్తవాళ్ళెదురుగా తిట్టడమెందుకని ఊరుకున్నట్టున్నారు. ఇప్పుడింక భరించాలి తిట్లు...

భయంగా చూస్తున్న జయని చూసి 'ఎందుకమ్మా అంత భయపడతావ్! ఏదీ ఆ సంచీ ఇలా పడెయ్! పాపం! ఏన్నాళ్ళయిందో మీరేవైనా టిఫిన్లు తిని. మిఠాయి కొని పట్టుకొస్తాను. మీరంతా తిందురు గాని' అన్నారాయన.

హఠాత్తుగా ఆయనకా బుద్ధి ఎందుకు పుట్టిందో అర్థంకాక తెల్లబోయి చూసింది జయ. 'ఇప్పుడెందుకు నాన్నా! భోజనం వేళవుతోంది కూడాను.'

'ఏం భోజనం లేమ్మా! పాపం వారు నీళ్ళు, మజ్జిగనీళ్ళతో ఏం తింటున్నారో ఏమో! నేనైతే రోజూ హోటల్లో ఏదో ఒకటి తినేస్తూనే ఉంటాను.' చివరి మాటలు మెల్లిగా అంటూ సంచీ అందుకున్నారు. జయకంతా అగమ్యగోచరంగా ఉంది. 'వెళ్ళేటప్పుడు నిలయ ఆయనతో ఏం మాట్లాడిందో తను విన్లేదు. ఒక్కసారిగా ఇంత మారిపోయారేమిటో!' మనసులోనే అనుకుంటూ వీధి తలుపు చేరవేసింది.

* * *

ఎప్పుడూ లేనిది తండ్రి మర్నాడు ఆఫీసునించి ఇంటికి త్వరగా రావటమే కాకుండా తారబ్బాందీ, మైసూర్ పాక్ పొట్లాలు చేతి కివ్వడంతో ఆశ్చర్యంగా చూసింది జయ. 'అందరూ ఇవి తినం డమ్మా! ఏవరూ ప్రొద్దున్న అన్నారు పక్కింటి చంద్రమ్మగారూ, వాళ్ళమ్మాయి మొదటి ఆట సినిమా కెళ్తున్నారని...ఆ... చిన్నదిగావును నీతో ప్రొద్దున్న అంటుంటే విన్నాను. డబ్బిస్తాను... మీరంతా కూడా ఇవాళ వాళ్ళతో కల్సి వెళ్ళండి సినిమాకి. నువ్వు చిన్నప్పుడు ఒక సినిమా అయినా చూసెరుగుదువేమో గనీ తక్కినవాళ్ళు పాపం సినిమా మొహమే ఎరగరు.'

'ఎందుకు నాన్నా! పంపిస్తే వాళ్ళ నెవరినైనా పంపించు గానీ నేను వెళ్ళను.'

గుటకలు మింగారు రామనాథంగారు 'అబ్బే! నువ్వు ... నువ్వెళ్ళకపోతే ఎలా? పెద్దదానివి. తక్కినవాళ్ళు స్కూలు పేరు చెప్పుకునైనా అలా వీధిలోకి వెళ్తున్నారు. పాపం! నువ్వసలు బైటకెళ్ళిం దెప్పుడు? రాత్రీ, పగలూ పంజరంలా ఈ ఇంట్లోనే గడపటం ...'

తండ్రి మాటలూ, చేతలూ వింతగా వున్నాయి జయకి.

'ఇంతమందిమీ వాళ్ళవెంటపడిపోవటం బాగుండదు నాన్నా' అంది చిన్నగా.

'ఓ! ఔను. ఒక పని చెయ్య. చిన్నవాళ్ళు ముగ్గుర్నీ వదిలేసి నువ్వూ, రమణీ, లక్ష్మీ వెళ్ళండి.'

'మరి మేము వెళ్తే వాళ్ళెడవరూ?'

'అబ్బే! ఏడవరు. నేను చూసుకుంటాగా వాళ్ళ సంగతి. ఊ. సరే! మరి నువ్వెళ్ళి ఆవిడతో చెప్పిరా. వంట అయిపోయిందిగా!'

'అయిపోయింది...' అయిష్టంగానే కదిలింది జయ.

నాన్నంటే ఉన్న భయంమూలంగా చిన్నవాళ్ళు ముగ్గురూ 'మేమూ వొస్తాం' అంటూ అక్కయ్యల వెంటపడలేదు. కానీ మనసులో మాత్రం సినిమాకి వెళ్తున్న అక్కయ్యలమీద చెప్పలేనంత కోపంగా ఉంది. ఆ కోపాన్ని దిగమింగుకుంటూ ఒకళ్ళ నొకళ్ళు జాలి చూపులు చూసుకుంటూ కూర్చున్నారు. జయకి వెళ్ళాలని లేదు. అయినా తప్పదు. తండ్రికి అనురాగమొచ్చినా ఆగ్రహమొచ్చినా దానికి లోను కావల్సిందే. అయిష్టంగానే కదిలింది. వాళ్ళు అలా వెళ్ళ గానే రామనాథంగారు స్నానం చేసి ఇస్త్రీ బట్టలు కట్టుకుని, సెంటు పూసుకున్నారు. పిల్లలు ముగ్గుర్నీ వంటింట్లోకి పిల్చారు. భయంతో బిక్కమొహం వేసుకుని వాళ్ళు వంటింట్లో అడుగుపెట్టారు. 'రండి ఇవి తీసుకోండి' అంటూ వాళ్ళ చేతుల్లో మైసూర్ పాక్ ముక్కలు పెట్టి, తర్వాత ఒక్కొక్కళ్ళకి పదేసి పైసలు కూడా ఇచ్చారు. 'రేపు ఏదైనా ఏవైనా కొనుక్కోండి' అంటూ. అంతే... ముగ్గురి మొహాల్లోనూ ఆనందం చిందులేసింది. సినిమా కెళ్ళలేదన్న బాధ చెదిరిపోయింది.

'హాయిగా ఇక్కడే కూర్చుని ఇవి తింటూ కథలూ, కబుర్లూ చెప్పుకోండి. మీ కింకా కావలిస్తే ఇదిగో ఇక్కడ పొట్లాలున్నాయి. తీసుకుని తినండి. ఎవరైనా మనింటికొచ్చి వాళ్లతో నేను మాట్లాడుతుంటే నవక మీరు రాకండి. ఇక్కడే కూర్చోండి. అల్లరి చెయ్యకండి' చెప్పదల్చుకున్నదంతా చెప్పి ఇవతలికి వొచ్చేశారాయన. మరికొంచెం సేపట్లోనే నిలయ వచ్చింది 'జయా!' అంటూ.

'రండి.' కంగారుపడి, సంతోషాన్ని అణిచిపెట్టి ఆహ్వానించారు రామనాథంగారు.

ఆయన నాటకం గమనించి తెల్లబోయి మళ్ళీ అంతలోనే తేరుకుని చిన్నగా నవ్వుకుంది నిలయ.

## ధ్యేయం!

భవ్యాన
రెండు ముద్దలు తిని
అవతల పడే బతుకుకాదు

అకస్మాత్ ప్రమాదవార్తల
పరిణామాల తాకిళ్ళలో
గుండెమీద బరువు
బరువేబరువై గుండెచెరువై —

విషాదాన్ని స్వీకరించే స్థితిలో
పరిపక్వతపొందుతూ
సాంప్రదాయకసానుభూతుల్నికాదుగాని
పోరాటాన్ని ఆయుధమై ఎప్పుడూ

విజయాలు కాదు
ఏకోన్నత పోరాటమే నా బతుకు —

—కె. శివారెడ్డి

'జయ లోపలుందా?' తంటూనే కుర్చీలో కూర్చుంది.

'పక్కింటివాళ్ళు సినిమాకెళ్తూ దాన్ని కూడా రమ్మంటే వెళ్ళింది వాళ్ళతో.'

ఎందుకో అనుమానం కలిగింది నిలయకి. అప్రయత్నంగా పైకి 'ఇవాళ నేనొస్తానని చెప్పానే.' ముసిముసిగా నవ్వుకున్నారు రామనాధంగారు.

'చిన్నపిల్ల...దానికేం తెల్సు? అయినా... ఆ సెందుకు మధ్య. మీ రొస్తారని నేనెక్కడికీ వెళ్ళకుండా ఉండిపోయాను గా' సిగ్గుపడుతూ, నెమ్మదిగా అన్న ఆయన మాటలు నవ్వు పుట్టించాయి నిలయకి

పెదవులమధ్య నవ్వు బిగపట్టి 'నాకోసం...ఎక్కడికీ వెళ్ళకుండా ఇంట్లో ఉండిపోయారు. అదే కావల్సింది. థాంక్స్' అంది తలవంచుకుని మొహంలో భావాలు ఆయనకి కనిపించకుండా.

పరవశంతో ఒళ్ళు మర్చిపోయారు రామనాధంగారు

'నిలయా!' అంటూ కుర్చీలో ముందుకి వంగారు.

'నాకు తెల్సు నీ మనసు నాకు తెల్సు. ఈ తరుణం కోసమే ఎన్నాళ్ళబట్టి ఎదురు చూస్తున్నానో తెల్సా?'

'తెలియకేం? నన్ను చూసిన మొదటి రోజునించీను. అంతేనా?' నవ్విస్తూ చూసింది నిలయ

కరిగిపోయారాయన.

నిలయువంక మైమరచి కాసేపు చూసి 'నిలయా' అంటూ ఆత్రంగా దగ్గరికి రాబోయారు.

చటుక్కున మాట మార్చింది నిలయ 'పిల్లల మాటలు వినపడుతున్నాయి.'

'ఔను. చిన్నవాళ్ళు ముగ్గురూ సినిమాకి వెళ్ళలేదు.'

'ఇలా పిలవండి వాళ్ళని. లోపలేం చేస్తున్నారు?'

'ఎందుకూ! మనని మాట్లాడుకోనివ్వరు. ఉండు. ఇప్పుడే వొస్తాను' అంటూ గబగబా లోపలికి వెళ్ళి ఒక ప్లేటులో స్వీటూ, హాటూ పెట్టి పట్టుకొచ్చి మధ్యలో స్టూల్‌మీద పెట్టి 'తీసుకో' అన్నారు నమ్రంగా.

కొద్దిగా తీసుకుని నోట్లో వేసుకుని 'నేనిప్పుడే కాఫీ, టిఫినూ తీసుకు వొచ్చాను. మీరు తీసుకోండి' అంటూ ప్లేటు నిలయకి దగ్గరగా జరిపింది నిలయ. నిలయ చేతివేళ్ళు తాకుతూ ప్లేటు అందుకున్నారాయన.

'నేనంటే మీకు ...' సిగ్గుపడుతూ ఆగిపోయింది నిలయ.

ఆ ఒక్క మాటతోనూ ఉబ్బితబ్బిబ్బయిపోయా రాయన.

'నువ్వు... నువ్వంటే నాకెంతో ఇష్టం. ఆ ఒక్క మాటలోనే అన్ని అర్థాలూ ఉన్నాయి గ్రహించుకో' అంటూ అంత వయసులోనూ ఇరవయ్యేళ్ల కుర్రాడిలా కొంటెగా నవ్వారు. మరికాసేపు కూర్చున్నాక లేచింది నిలయ 'నే వెళ్లనా మరి?'

'అప్పుడేనా! జయ సినిమానించి పదింటిగ్గానీ రాదు.'

'అమ్మో! జయ పదింటిగ్గానీ రాదు కదా అని అప్పటిదాకా కూర్చుంటే ఒక్కదాన్నీ ఇంటికెలా వెళ్తాను?'

'నేనొస్తాను సాయం మీ ఇంటిదాకా!'

'హొద్దొద్దు. పాపం... పిల్లలొక్కళ్ళూ ఇంట్లో పెద్దవాళ్ళు లేకుండా ఎలా ఉంటారు?'

ఆ క్షణంలో పిల్లలమీద చెప్పలేనంత కోపం ముంచుకొచ్చిందాయనకి. చేసేది లేక నిస్సహాయంగా 'సరే' అన్నారు.

'ఇంకనించి నేను రోజూ మిమ్మల్ని కల్సుకోందు కొస్తాను. ఎక్కడికీ వెళ్ళకుండా నాతోనే కాలం గడుపుతానని మాటివ్వండి' కుడిచేతిని ముందుకి ముందుకు చాపింది నిలయ. ఆ చేతిలో తన చేతినుంచి చటుక్కున ముందుకి లాక్కున్నారు రామనాధంగారు.

'ఉష్!' అంటూ వంటింటివైపు చూపించి వెనక్కి తప్పుకుంది నిలయ.

'రేపట్నించీ ఇంట్లో కల్సుకోవద్దు మనం. ఆ! పోనీ నేనే మీ ఇంటికొస్తే. మీ ఇంట్లో నువ్వుతప్ప మరెవరూ లేరుగా.'

కంగారుపడింది నిలయ 'హొద్దొద్దు. ఇరుగుపొరుగు మంచివాళ్ళుకారు. మర్నాటినించీ నన్ను బతకనివ్వరు.'

'అయితే రేపు సాయంత్రం గాంధీ పార్కులో కల్సుకుందాం. సరేనా!'

'ఓ కే.' అంటూ చెయ్యిఊపి గబగబా బయటకి నడిచింది నిలయ.

లోపలికి వస్తూనే పిల్లలమీద విరుచుకు పడ్డారు రామనాధంగారు 'ఏమిటర్రా మీ అల్లరి' అంటూ.

'బైటికి పోయేందుకు లేకుండా మీ రొకళ్ళు తగులుకున్నారు నాకు' అంటూ రుసరుసలాడారు నిలయతోపాటూ తను కూడా వాళ్ళింటిదాకా వెళ్ళడానికి వీల్లేక



## విడిన మబ్బులు

పోయిందన్న బాధతో. అంతకుముందు దింతో ప్రేమగా మాట్లాడి, అన్నీ తినమని పెట్టివెళ్ళిన తండ్రి ఇంతలోనే ఎందుకలా మారిపోయాడో అర్థంకాక తెల్లబోయి చూస్తూ అక్కడినుంచి ఇవతలపడ్డారు పిల్లలు. రాత్రి జయక్కవచ్చి అన్నంతిని పడుకునేదాకా మెలకువగానే ఉంది కమల.

'ఏం! ఇంకా నిద్రపోలేదా కమలా! పేచీ పెట్టకుండా అన్నం తిన్నారా? నే వెళ్ళాక అల్లరి చెయ్యకుండా ఆడుకున్నారా ?' అంటూ కమల పక్కన పక్కవేసుకుంది జయ.

'అల్లరి చెయ్యలేదు. నువ్వెళ్ళాక ఒకా విడ మనింటికొచ్చింది. చాలాసేపు కూర్చుని నాన్నతో కబుర్లు చెప్పింది' అంటూ, ఆ వొచ్చినావిడని తను వంటింట్లోంచి తొంగి చూసినట్టు చెప్పింది. ఆవిడెలా ఉంటుందో కూడా వర్ణించి చెప్పింది. ఆ వర్ణనని బట్టి, వొచ్చింది నిలయేనని గ్రహించింది జయ. తనీరోజు వస్తానని చెప్పినా కూడా సినిమా కెళ్ళిపోయినందుకు ఏమనుకుందో ఏమో! అయినా నాన్నగారితో ఏం మాట్లాడి ఉంటుంది. తను చెప్పిన విషయాలు నిలయ నతో చెప్పేసిందా ? చెప్తే నాన్నగారిలా ఉంటారా? తను రాగానే తలుపు తీసి నప్పుడుగానీ, ఆ తర్వాతగానీ ఆయన ముఖంలో కోపచ్ఛాయలేమీ లేనే లేవే! లేకపోతే ఇదంతా తుఫానుముందరి ప్రశాంతత కాదు కదా! గొప్పొద్దున చావ బాదరు కదా! కోపం వస్తే ... భగవాన్ ! ఇప్పుడేందారి? ఎటువంటి సమస్య తెచ్చి పెట్టావు ... లేనిపోనిది అసలా నిలయ నెందుకు పిలవాలి నాన్న ? తన ఏడుపేదో తనేడ్చి ఊరుకునేది నిన్న. నాన్నే పిలిచి సంగతేమిటో కనుక్కోమంటే ఉన్నబాధంతా చెప్పుకుంది తను...తన తప్పేముందీ?' అలా ఆలోచిస్తూనే ఎప్పుడో మెల్లిగా నిద్రలోకి జారుకుంది జయ.

* * *

'అక్కా! అక్కా! మరే నిన్న మనింటికి రాలా! ఆవిడనూ నాన్నగారూకల్సి గాంధీ పార్కులోకెళ్తూ కనపడ్డారు నాకు' కమల సమాచారం అందించింది స్నేహితురాలింటి నించి వచ్చాక 'ఛ! నోర్మూసుకో. ఎవర్ని చూసి నాన్నగారనుకున్నావో !' కసిరింది జయ.

'నిజం. అక్కా ! ఒట్టు. నేను సరిగ్గానే చూశాను. నాన్నగారూ, ఆవిడా...'

'సరేలే. నాదగ్గరంటే అన్నావు. ఇంకెవరిదగ్గిరా అనకు.' పైకలా అందే కానీ జయ మనసులో దాన్ని గురించిన ఆలోచన్లే నిండిపోయాయి. నిలయకి నాన్న గారితో తిరగవల్సిన అవసరం ఏమిటి ? ఏవేవో ఓదార్పుమాటలు చెప్పిందారోజు తనకి. అన్నీ నమ్మింది తను. కానీ జరుగుతున్నది ఏమిటి? జరగబోయేదేమిటో! నిన్న అసలు తనకోసం రాలేదా నిలయ ! నాన్న గారికోసమే వచ్చిందా! తనకోసమే వచ్చి ఉంటే 'జయా! నీకోసం నిలయ వచ్చింది నిన్న' అని చెప్పకుండా ఉంటారా? పోనీ నిన్న నాన్నగారితో ఊరికే కబుర్లేను చెప్పుకున్నారేమో అనుకుంటే ఇప్పుడీ షికార్లేమిటి ఆయనతో. నిన్నసలు ఇంటి విషయాలేమీ ఆయనతో మాట్లాడలేదన్న మాటే!' జయ మనసు గజిబిజిగా ఉంది. ఆలోచన్లతో తల బరువెక్కింది. ఏదో తెలియని, అంతుపట్టని అనుమానం మనసుని దొలిచేస్తుండగా బలవంతాన వంటపనిలో మునిగిపోయింది.

(ఇంకా వుంది)




### రథీన్ మైత్రా



(జననం :1913) కలకత్తా రాజకీయ కళా విద్యాలయంలో మేధావంతులైన విద్యార్థులలో రథీన్ మైత్రాని ప్రత్యేకించి చెబుతారు. కళ కోసమే తామని వీరంటారు. చిత్రకళతోబాటు క్లేమాడలింగు, స్కల్ప్చర్, గ్రాఫిక్స్ మొదలైనవి తయారు చేసేరు. సంగీత రంగశిల్పాలపైన వీరికి అభిరుచి ఎక్కువ.

భారతదేశంలో జరిగిన ప్రతి గ్రూప్ ప్రదర్శనలోను వీరు పాల్గొన్నారు. కలకత్తా, బొంబాయి, ఢిల్లీలలో వీరి చిత్రాలు ప్రదర్శించబడ్డాయి. లండన్, అమెరికా మొదలైన అంతర్జాతీయ ప్రదర్శనలకు వీరి చిత్రాలు వెళ్ళేయి. 'కలకత్తా గ్రూప్' చిత్రకారులకు యాజమాన్యత వహించేరు.

వీరి చిత్రాలు హృదయాన్ని స్పర్శిస్తాయి. రచనా వస్తువుకి అనుకూలమైన రంగులు ఎన్నిక చెయ్యడంలో వీరిది అందెవేసిన చేయి. యదార్థవాద శైలి అయినా అందులోనూ వీరు తమ ప్రత్యేకత నిల్పుకొన్నారు.




జి. రమణ, తుని.

8 సం,ల మా తమ్మునికి చాలారోజుల నుంచీ పనిచేసినా, నడిచినా ఎక్కువగా ఆయాసంగా వుంటుంది. కొంతసేపటికి తగ్గుతుంది.

* పని చేసినప్పుడు, ఆయాసం రావటాన్ని 'ఎక్సర్షనల్ డిస్నియా' అంటారు. దీనికి హృదయము, వూపిరితిత్తులు—వీటిలో మార్పులు—రోగాలు ముఖ్యకారణాలు పుట్టినప్పటి నుండీ వుండే హృద్రోగములు (కన్‌జెనిటల్ హార్ట్ డిసీజ్) వూపిరితిత్తులలో క్రానిక్ బ్రాంకైటిస్' ఎంఫైసీమా మొదలగు రోగాలు వుండటంవల్ల ఆయాసంగా వుండవచ్చును

వైద్యపరీక్ష, X—రే, ఇ. సి. జి. మున్నగువాటి వల్ల—రోగ నిర్ధారణ అవుతుంది. రోగాన్నిబట్టి వైద్యం నిర్ణయించాలి.

ఆర్. రాజారెడ్డి, పత్తివారిపాలెం. (చిత్తూరు)

రోజుకి 15–20 సార్లు మూత్ర విసర్జన చేస్తూ వుంటాను. చిన్నప్పటి నుంచీ ఇలా వుంది. ఇది ఎ. డి. హెచ్ లోపమా?

* మూత్ర పరిశోధన చేసిన అనంతరం ఇది 'డయాబెటిస్ ఇన్సిపిడస్' అవునా కాదా అని తేలుతుంది. స్పెసిఫిక్ గ్రావిటీ ఈ రోగం వున్నవారి మూత్రంలో తక్కువ. (1002–1004) ఈరోగం పిట్యుటరీ గ్రంధిలోని వెనుకభాగం దెబ్బతినటం వల్ల వస్తుంది. ఈ చోటులో కురుపులు, దెబ్బ తగిలినప్పుడు ఏర్పడే ఫ్రాక్చర్, వాయటం, సిఫిలిస్, ఇలా జరగటానికి కొన్ని కారణాలు.

ఈ రోగం వున్నప్పుడు అతిగా దాహం వేయటం ముఖ్య లక్షణము. కొందరికి హిస్టీరికల్ పాలీయూరియా వల్ల కూడా ఇలా జరుగుతుంది కాని స్పెసిఫిక్ గ్రావిటీ నీరు త్రాగనప్పుడు హెచ్చుగా వుంటుంది.

'వాసో ప్రెస్సిన్' ఇంజక్షన్లు వైద్యుల సలహాతో వేయించుకోవాలి. °5–1cc వరకు మాత్రమే వాడవచ్చును

పి. రవీంధర్, హనుమకొండ.

నా శ్రీమతి వయస్సు 19 సం. లు. ఆమెకు రేచీకటి జబ్బు వున్నది. నాలుగు సం ల క్రితం వైద్యం చేయించాము ఫలితం శూన్యం

* రేచీకటి రావటానికి చాలా కారణాలు వున్నాయి. కారణాలను అన్వేషించకుండా వైద్యం మొదలుపెడితే ఫలితం శూన్యం.

విటమిన్ 'ఎ' లోపం, కంటి లోపలి పొరలో ఏర్పడే 'రెటినైటిస్ పిగ్‌మెంటోసా', అలసట, ఆందోళన ఇలా రావటానికి ముఖ్య కారణాలు. నేత్ర వైద్యులచే 'ఫండస్' (కంటి పరీక్ష) టెస్టు చేయించి, తగిన మందులు వాడండి.

బి. విజయలక్ష్మి, విశాఖపట్నం.

మా పాపకు 8 నెలలు నిండాయి. ఇంతవరకూ ప్రాకటం, కూర్చోవటం గాని లేదు.

* పెరుగుదల, ఒక్క ఆహారంమీదనే ఆధారపడి వుండదు. కుటుంబంలో ఇతరుల పెరుగుదల, పోషకపదార్థాల లోపం కొన్ని రోగాలు — ముఖ్యంగా ప్రైమరీ కాంప్లెక్స్ వల్ల ఇలా జరగటానికి అవకాశం వున్నది. ప్రాకటం, కూర్చోవటం, ప్రతి పిల్లలకీ వేరువేరు సమయాలలో జరగటం సామాన్యము. దయచేసి బాల్ డ్రాప్స్, 'మార్విటా' మొదలగునవి ఇవ్వండి. ముఖ్యంగా పిల్లలకి అంటువ్యాధులు రాకుండా వ్యాధి నిరోధక ఇంజక్షన్లు ఇప్పించండి

ఎస్. చంద్రశేఖర శర్మ, మదనపల్లె.

'డిఫ్తీరియా' అంటే ఏమిటి? రోగ లక్షణాలు నివారణోపాయాలు తెలుపగోరుతున్నాను

* 'డిఫ్తీరియా' ఒక అంటువ్యాధి. ఇది సాధారణంగా 8 సం ల లోపు పిల్లలకి వస్తుంది.

జ్వరము, గొంతునెప్పి, గొంతు లోపలి భాగంలో తెల్లని పొర ఏర్పడటం, మాట లాడుటకు కష్టంగా వుండటం, చివరికి వూపిరిపీల్చటంకూడా కష్టంగా వుంటుంది. చివరిదశలో చేతులు, కాళ్ళు స్వాధీనం తప్పటం, ఇతర ఉపాంతరాలు రావచ్చును.

ఇలా వచ్చినప్పుడు వెంటనే పెద్ద ఆస్పత్రులలో చేర్పించి వైద్యం చేయించాలి వారికి ఎ. డి ఎ స్, పెన్సిలిన్ మొదలగు మందులు వాడుతారు.

ఈ రోగం రాకుండా పిల్లలు పుట్టిన మూడవ నెల, మొదలుగా, నెలకొకసారిగా మూడుసార్లు 'ట్రిపుల్ ఆంటిజన్' ఇంజక్షన్లు వేయించాలి. 18 వ నెలలో 5 వ సం. లో తిరిగి ఒక ఇంజక్షను వేయించాలి.

ఎ. రమాదేవి, వెనిగండ్ల.

రజస్వల అయిన ఆడపిల్లలను—మామిడి కాయలు, వేరుసెనగకాయలు తింటే కాళ్ళు పట్టుకపోతాయి, కడుపునెప్పి వస్తుంది అంటారుకదా, పత్యము చెయ్యనివారికికూడా కడుపునెప్పి వస్తోందికదా — అలాంటప్పుడు ఏ జాగ్రత్తలు తీసుకోవాలి.

* **బహిష్టు అయిన సమయంలో** కడుపునెప్పి రావటం; మామూలుగా చాలా మందికి వుంటుంది. ఇలా నెప్పిరావటానికి కారణం రక్తస్రావం జరిగిన తర్వాత, నెత్తురు సులభంగా బయటికి పోనందున గర్భాశయం ఉబ్బి, కడుపునెప్పి రావచ్చును.

మామిడికాయలు, వేరుసెనగకాయలు ఎవరైనాకూడ మితిమీరి తింటే కడుపు నెప్పి వస్తుంది. మూఢనమ్మకాలు ఇంకా మనలో వున్నయికనుక, పెద్దల సలహా ప్రకారం రజస్వల అయిన కొన్ని నెలల వరకూ ఈ నియమాలను పాటించటంలో తప్పు లేదు. ●

# పెద్దకథ

(గత సంచిక తరువాయి)

అలాటి జగన్ — అంత నమ్మకంగా చెప్పిన జగన్—తన మనస్సులో దైవం లాగా పూజించుకున్న జగన్—ఇంత ద్రోహం చేసాడా? ఇదా తనకు అందిన తియ్యటి వార్త ?

కాలకూట విషంలాటి ఈ వార్తవిని తను బ్రతుకుతుందనే అనుకున్నాడా? జగన్...జగన్ ఎంతపని చేశావు?' దిళ్లలో మొహం దాచుకుని కన్నీటి ప్రవాహంతో ళ్ళు తడిసిపోతూంటే అలా ఎంతసేపు రుున్నదో......?

శేఖర్‌వచ్చి పక్కలో కూచుని, 'ఏమమ్మా ర్పు బాగా బడలిక చేసిందా తలనొప్పి న్నారట' అంటూ నుదుటమీద చేయి సి ఒదుగుతూంటే —

...రపడిన కళ్లెత్తి అన్నవంక చూసి ...

...ప్ప లేవకు వళ్ళు వేడిగా వున్నది. ...ంకు...ప్పినట్లున్నది, మందు ఇస్తాను వేసుకుని బాగా రెస్టు తీసుకో' అంటూ లేచి వెళ్లేడు శేఖర్.

వదిన తెచ్చిఇచ్చిన మాత్ర వేసుకుని కాఫీ త్రాగి పరున్నది సుజాత.

కన్ను మూతపడటం లేదు. గుండెల్లో దుఃఖం తెరలు తెరలుగా వుబుకుతోంది. పక్కనే పడున్న కవరుమీద ఆమె దృష్టి పడింది క్షణంసేపు అలాగే చూసి విరక్తిగా చించి చదవసాగింది.

నా సుజీ,

నీకు ఏమని రాయాలో తెలీటంలేదు. ఇలాటి వుత్తరం నీకు వ్రాయవలసి వస్తుందని నేను కలలోనయినా అనుకోలేదు. క్షమించమని కోరే అర్హతకూడా నాకులేదు. నీలో ఎన్నో ఆశలు రగిలించి జీవితం పూలబాటఅని భ్రమింపచేసి — సుఖ— సంతోషాలన్నీ నీముందు కుప్పపోస్తానని వాగ్దానం చేసి — ముగ్ధమనోహరమైన నీ మనస్సులో అనురాగబీజాలు నాటి ప్రేమలతను సుకుమారంగా పెంచి — ఇప్పుడిలా నిర్దయగా ఆ లతను తెంపివేసిన క్రూరుణ్ణి — నీకు ఇలా రాసే దుర్మార్గుడ్ని నువ్వు క్షమించ నక్కర్లేదు సుజీ—కసిదీరా తిట్టు. అదే నాకు తృప్తి. అయినా సుజీ నా మనస్సుకు శాంతి వుండదు. నీకు ఏమని వ్రాయను నా గుండెల్లో రగిలేబాధ నీకు అర్థం **అవుతుందా!** నీకు ఇలా దూరం కావటానికి, నాలో ఎంత పెనుతుఫాను చెలరేగుతున్నదో ఎలా చెప్పను! పరిస్థితులు నన్ను బందీని చేశాయని చెప్పటం అపహాస్యమే, అయినా చెప్పక తప్పదు. హైద్రాబాద్‌లో మా మామయ్య ఒకడువున్నాడు. ఆయనో పెద్ద బిజినెస్‌మాన్. జీవితాల్తోకూడా బిజినస్ చేయగలంతటి ధీశాలి — ధనమనే అగాధం మా రెండు కుటుంబాల్ని వేరుచేసి రాకపోకల్ని బంద్ చేశాయి. ఇంతకాలంగా మరచిన బంధుత్వం ఇవాళ ఆయనకు గుర్తు వచ్చింది. ఎందుకో తెల్సా? ఆయనకో చెల్లని రూపాయిలాటి కూతురున్నది. సకల (అవ) లక్షణ సంపన్నురాలైన ఆ పిల్లకు నేను

తప్ప మొగుడుగా వుండే అర్హత ఈ లోకంలో మరెవరికీ లేదనుకున్నాడు మా మామ. నా ఖర్మకొద్దీ నేను ఆయన కంట పడ్డాను ఆయన ఇవ్వచూపే ఏభై వేల రూపాయల కట్నంతోపాటు ఆయన బిజినెస్‌లో సగం భాగానికి అమ్మా, నాన్నా లొంగిపోయి—అలనాటి కావేషాలు మరచి — అదే నా కర్తవ్యమనే నాన్నగారి అజ్ఞకు — అమ్మ కన్నీటికి లొంగిపోక తప్పలేదు కుటుంబ శ్రేయస్సుకొరకు, కొడుకుగా నా కర్తవ్యం నెరవేర్చుకుని కన్నవారి రుణం తీర్చుకుందుకు నా మనస్సులో అగ్ని రగులుతున్నా సహించి అమ్మా—నాన్న ఆదేశాన్ని తలవొంచి స్వీకరించాను కాని సుజీ నిన్ను వొదులుకునేందుకు ఎంత విలపించానో—నా మనస్సుకే తెల్సును - ఈ సంఘర్షణలో నా మనస్సు మసి అయిపోయింది ఇకముందు మనస్సులేని మనుగడే బాధ్యతల బరువులో బ్రతుకు కృంగిపోయి జీవచ్ఛవంగా బ్రతికే పిరికివాడై — ఇంకేం వ్రాయను సుజీ!

నీవాడు అని చెప్పుకోలేని—నీ జగన్.

ఆ వుత్తరాన్ని కసిగా చింపి ముక్కలు చేసి మూలకు విసిరింది సుజా, అప్పుడు తన చిన్నతనాన అత్తయ్యకూడా ఇంతే చేసింది తను పుట్టినరోజునే అత్తయ్యవచ్చి చూసి 'మా కోడలు పుట్టింది' అని సంబరాలుపడుతూ అందరితోనూ చెప్పిందట. వచ్చినప్పుడల్లా అవీఇవీ తెచ్చిఇస్తూ మురిపెంగా చూచేదిట అలాటి అత్తయ్య అమ్మపోయాక తల్లిలేని పిల్ల తనపాలబడుతుందేమో, తను కోరిన ముద్దుముచ్చట లేవీ జరుగవని మొహం చాటు చేసింది నాన్నపోయాక ఆ కొద్దిపాటి రాకపోకలు కూడా ఆగిపోయాయి తను కోరినంత కట్నంవచ్చే సంబంధం చూసి కొడుక్కు పెళ్ళిచేసింది తల్లి చెప్పినట్లు తలూపి 'బుద్ధిమంతుడన్న' కితాబు తెచ్చుకున్నాడు బావ ఆనాడు తనేమీ బాధపడలేదు, అత్తయ్య స్వార్ధానికి నవ్వుకున్నదంతే . బావ రు పురేఖలైనా తనకు గుర్తులేదు కానీ కానీ జగన్? తన సర్వస్వాన్ని దోచుకుని 'ప్రేమించా నీ, పెళ్ళిచేసుకుంటా'నని ఎన్నో వాగ్దానాలుచేసి చివరికిలా ఇతడూ డబ్బుకే అమ్ముడుపోయాడు — ఏభైవేల రూపాయల కట్నానికి అతడి కళ్ళు మూసుకుపోయాయి అతడికేమీ బాధలేదు— తనే—తనే ఆ కట్నమనే కొడ్తాలు బుర కొట్టి తన గుండెలమీద కాటు వేసి ట్లు బాధతో మెలితిరిగి పోతూంది. ఈ బాధ భరించటం తనవశం కావటం లేదు. అయ్యో! భగవాన్ నేనేమి చేయను? ప్రేమానురాగాలంటే తెలీక మోడువారిన తన మనస్సు అతడి అనురాగ వాహినిలో తడిసి సస్యశ్యామలమై చివురించి సుకుమారంగా ప్రేమలత తీవలుసాగి అతడిచుట్టూ పెనవేసుకున్నది, అతడి తీయని పెదాల్లోంచి వెలువడే ప్రతిమాటా — వీణాస్వనాలై రాగమాలికలు తనువెల్లానిండి పులకరించేది ఈ విశాల విశ్వమంతా అతడుగానే గోచరించి, అతడు లేనిది తనకు ఇహమే లేదన్న భ్రాంతిలో పడింది ఎంత వెర్రిగా అతడి మాటల్ని నమ్మి గోతిలో పడింది!

'మగవారి మాటలు నీటిమీద వ్రాతలనీ, లోకంలో ఇంత కుటిలత్వం వున్నదనీ తెలియని ముగ్ధమనస్సుతో అతణ్ణి నమ్మింది కలనైనా అనుకోలేదు ఇంత దగాచేసి పోతాడని ఇప్పుడు తనకేమి దారి! కళ్ళలోంచి జలపాతాలు దూకుతూంటే పిచ్చిగా కిటికీలోంచి బైటకు చూడసాగింది సుజాత అప్పుడప్పుడే చీకటి తెరలు నలుదెసలా కమ్ముకుంటున్నాయి.

పక్కవాళ్ళింటి కిటికీవేపు చూసింది. ఆ కిటికీ తలుపులు మూసివేసియున్నాయి. ఆ గదిలోనే జగన్ వుండేవాడు ఏ వేళప్పుడు చూసినా ఆ కిటికీ తలుపులు తనకొరకు తెరచే వుండేవి రాత్రివేళ ఆ కిటికీనుండి ప్రసరించే వెలుగు తన గదిలోకివచ్చి కాంతి నింపే ఎన్నో వెన్నెలరాత్రులు ఆ కిటికీ వద్ద అతనూ — తను ఇక్కడా కూచుని తమకంగా కళ్ళతో మాట్లాడుకునేవారు, పరీక్షల రోజుల్లో ఆ కిటికీదగ్గర చైర్లో కూర్చుని ఎంతో పొద్దుపోయే వరకు చదివేవాడు జగన్ అంత పట్టుదలగా చదివే అతణ్ణి చూస్తే సరదావేసేది తనకు — ఎప్పుడో ఒక్కసారి అలసిపోయి ఎర్రపడిన కళ్ళెత్తి ఈ వైపు చూసేవాడు ఆ చూపు తన హృదిలో మూలమూలలా చొచ్చుకుపోయి ఆహ్వానించేది. ఆ పిలుపుకు తను నిలవలేక పోయేది అలసి వాడిన అతడి మోము గుండెలకి హత్తుకోవాలని — వేడి వేడి టీ చేసి పెదాలకందించి సేదదీర్చాలనీ ఆరాటపడేది ఇద్దరి మధ్యానున్న ఈ అడ్డుగోడలు ఎప్పటికి తొలగిపోతాయోనని నిట్టూర్చింది రాత్రిళ్ళు అలా అతడివేపు



'మంచి'కి విలువ ఎప్పుడూ ఉంటుంది నీళ్లు అయినా 'మంచినీళ్లు' అయితే గ్లాసు 5 పైసలు ధర పలుకుతుంది మదరాసు మెరీనాబీచ్‌లో ఒకడుండా, రెండు మూడు గ్లాసులు పెట్టుకుని మంచినీళ్ల వ్యాపారంచేస్తున్న కుర్రవాడిని ఫొటోలో చూడవచ్చు (ఫొటో నఖచిత్రకారుడు శ్రీ సంపత్ కుమార్)

రాస్తూనే నిద్రలోకి జారేది. తెల్లవారి లేస్తూనే ఆ కిటికీలోంచి అతణ్ణి చూపి 'విష్' చేస్తేగానీ మామూలు కార్యక్రమం మొదలయేది కాదు. అలా సర్వవేళలా తన కొరకు తెరచివుండే తలుపులు ఈ రోజు మూసుకున్నాయి. శాశ్వతంగా మూసు కున్నాయి ఇక ఎన్నటికీ అవి తెరుచుకోవు—ఆ కిటికీలోంచి వచ్చే వెలుగు ఇంక తన గదిలోకి రాదు తన బ్రతుకంతా చీకటే మయం. త కొరకు పసిడిద్వారాలు తెరుచుకుని అమృత హస్తాలు చాచుకున్నాయన్న భ్రాంతిలో మైమరచి ఆనందాతిరేకంతా ఆ చేతురో వాలిపోయింది అంతలోనే అవి రాక్షసహస్తాలై తనని నిర్దయగా బైటకు నెట్టివేసి భళ్ళున తలుపులు మూసు కున్నాయి ఆశోఽహతురాలై ఆపలేని నిర్వే దంతో ఆ కవాటాలముందు వొరిగిపోయి రోదిస్తోంది 'భగవాన్—నేనేమి పాపంచేశాను' నాకెం౨ కీ శిక్ష. కిటికీ చువ్వలకు నుదురు కొటు కుంటూ పిచ్చిగా ఏడువసాగింది సుజాత.

అంతలోనే ఆమె కళ్ళు క్రోధారుణిమ దాల్చి వెర్రికోపంతో వూగిపోయింది

'ప్రేమిఃచానన్నాడు—పెళ్ళి చేనుకుంటా నన్నాడు తన కోపమై లోకాన్నయివా ఎదిరించగల.ని ప్రగల్భాలు పలికి — చివరికిలా డబ్బుకోసం అమ్ముడుపోయి — 'బాధ్యతలు—బాధ్యతలు' అం టూ మొహం చాటుచేశాడు. ఆడదాన్ని వంచించి—మోజాతీరేక—ఈ మగ

## తెరచి మూసిన తలుపు

వాళ్ళకి—ఈ రాస్కెల్సుకు బాధ్యతలు గుర్తు వస్తాయి. కనిపెంచిన తల్లిదండ్రుల పట్లనే కాదు. ప్రేమించి—జీవన సర్వస్వాన్ని అర్పించి ఆరాధించే ఆడదానిపట్ల కూడా బాధ్యత లుంటాయని ఇలాటి మూర్ఖులు తెలుసుకోరు—అసలు ఈ మగవాళ్లకు మనసంటూ ఒకటున్నవా! ఎవరెటు తిప్పితే అటు తిరిగి పోయే పిరికివాళ్ళు—వాజమ్మలు—అసమర్థులు వీళ్లకు ప్రేమంటే ఏమి తెలుస్తుంది? ప్రేమించి దగ్గరకు వచ్చిన ఆడదాన్ని పెళ్ళి చేసుకునే ధైర్యంలేక—బాధ్యతలనే ముసుగు ధరించి పదిమందిని నమ్మించటాని త్యాగం చేసినట్లు నటిస్తారు—ఇలాటి వీళ్ల బ్రతుకంతా అబద్ధపు నటనగానే సాగుతుంద వీళ్లకి డబ్బేజీవిఽం ధవ సంపాదనకు ఎంత నైచ్యానికైనా పాల్పడతారు ఈ డబ్బుగల వాళ్ల అంతర్యం దుర్గంధ భూయిష్టం. కార్లలో తిరిగి కాక్‌టెయిల్ హోటళ్ళల్లో పీకలుమొయ్య తిని తాగి, బార్లల్లోదూరి భామకలాపాలు సాగించే వీరికి ఆడదాని విలువ తెలియదు. దౌర్జన్యంతో దగ్గరకు లాగి అనుభవించటమే తెల్సు—అడది అందనంతవరకు తీపితీపి కబుర్లుచెప్పి చొంగలు కార్చుకుంటూ కుక్కల్లాగా వెంటతిరిగి, ఆడది అందేసరికి రేచుల్లాగామారి ఆడదాని జీవితాన్ని ఖండ ఖండాలుగా చీల్చి ముక్కలు చేసే ఈ మగవాళ్ళు నరరూప రాక్షసులు—

ఈలాటి ధూర్తుల పాలబడి అమాయకులైన ఎందరు ఆడపిల్లల జీవితాలు బలైపోతున్నాయెా? అనాది నుండి మగవారి దౌష్ట్యం ఇలాగే సాగుతూంది ఈ కథకు అంతం లేదు ఈ పాతకథ అంతరించి కొత్తకథ మొదలయే దెప్పటికి? ఈ లోపల ఎన్ని జీవితాలు నాశనమైపోవాలి? ఆడదాని జారిపాట, మగవాడి పాలిట ఆనందలహరిగా ఇలా కొనసాగవలసిందేనా? వీల్లేదు — వీల్లేదు.

ఈ దురన్యాయాన్ని —మగవాడి దురహంకారాన్ని అణచివేయాలి — 'అడది మనిషి కాదు — విలాస వస్తువను' కునే నీచులకు బుద్ధి చెప్పాలి.

మగవాడు 'నవ్విస్తే నవ్వటం—ఏడిపిస్తే ఏడవటం' ఇదే ఆడదాని జీవితంకాదని — తనదైన జీవితం తనకున్నదనీ నిరూపించాలి—హూ. ఆడదంటే ఏమిటనుకున్నాడు?

రాగమాధుర్యంతో మగవాడి హృదయాన్ని రంజింప చేయటమేకాదు. మగవాడి మోసాన్ని— దుష్టత్వాన్ని ఎదుర్కునేప్పుడు కాళికా రూపందాల్చి మగవాడి జీవితాన్ని భస్మీపటలం చేయగలంతటి శక్తిమంతురాలు—తన శక్తి ఎంతటిదో నిరూపించాలి

డబ్బుకోసం గడ్డితినే డర్టీబ్రూట్స్ ఈ మగవాళ్ళు ... ... మనస్సుల్లో పేరుకున్న మాలిన్యాన్ని కప్పిపుచ్చుకుంటూ మడత వలగని తెల్లని దుస్తులు ధరించి పెద్ద మనుషులనే ముసుగులు ధరించి తిరుగుతూ — నయవంచకులై ఆడదాని జీవితంతో చలగాటమాడి కుక్కలు చింపివ విస్తరిలాగా నడిబజారుపాలుచేసే ఈ కిరాతకులకు బుద్ధిచెప్పాలి మగజాతి మీదనే అంతులేని క్రోధం అసహ్యం అణుఅణువునా దవానలంగా వ్యాపించి దహిస్తోంది. ప్రతి మగవాణ్ణి వలవేసి పట్టి బంధించి జలగలా పీడించి సర్వనాశనం చేయాలి ధనంకోసం ఆడదాని జీవితాన్ని బలిచేసే ఈ మగవాళ్ళు— మళ్ళీ ఆడదానికోసమే అంతులేని ధనం గుమ్మరిస్తారు. అందమైన ఆడది కనిపిస్తే కామంతో కళ్ళుమూసుకుపోయే ఈ నీచుల్ని పతనంలోకి లాగటానికి క్షణంసేపు పట్టదు. ఈ ధనవ్యామోహితుల్ని—తన అందానికి బందీలుగాచేసి — చివరి పైసాదాకా వొద్చుకుని బికారుల్నిచేసి పడివీధిపాలు చేయాలి. ఈ దిక్కుమాలిన



లోకంలో ఎందరో జగన్‌లు-ఆడపిల్లల జీవితాల్తో చెలగాటమాడే ఈ భ్రష్టుల్ని కామ వ్యామోహితుల్ని వేసి కళ్ళుకప్పి పాతాళా కి తొక్కేయాలి అప్పుడుగాని తనలో కసి చల్లారదు అప్పుడుగాని తను ఆకర్షణ ఎంతటిదో అతడికి తెలిసిరాదు 'జగన్ ! నా మనస్సుతో ఆడుకుని — నీ సుఖం కోసం — నీ కర్తవ్యంకోసం నన్ను నడి సముద్రంలో ముంచావు — ఎవరి విస్తరిలో వారే పంచభక్ష్యాలు నింపుకోవాలని నీతులు వల్లించి, నీ విస్తరిలో నిండు భోజనం నింపుకొని—నా ముందున్న విస్తరి చించి లేచిపోయావుగదూ!—దీని ఫలితం ఎప్పటికైనా అనుభవించలేకపోవు! నా కన్నీరు మహాసముద్రమై నీ బ్రతుకుని ముంచివేస్తుంది' అప్పుడుగాని నా బాధ నీకు తెలిసిరాదు జగన్! ..

బాధతో మనస్సు చుట్టుకుపోతూంటే కళ్ళు గట్టిగా మూసుకున్నది.

తను సెకండు బి. ఏ చదువుతున్నప్పుడు, వదిన తమ్ముడు సుధాకరం శెలవులకని వచ్చాడు. మొదటిచూపులోనే తనమీద వ్యామోహం పెంచుకుని — తన కడగంటి చూపులకోసం చాలాంచలాల స్పర్శకోసం వెర్రెత్తినట్లు తనచుటూ తిరిగేవాడు తనకు చిరాకు కలిగి అతణ్ణి తప్పించుకు తిరిగేది, ఇప్పుడతడామెకు గుర్తుకువచ్చాడు. అవును ఆ సుధాకరాన్ని రమ్మని వ్రాయాలి - అతడి తరువాత మరొకడు. ఆ తరువాత ఇంకోడు—అలా ప్రతి మగవాడిని బురదగుం

# తెరచి మూసిన తలుపు

టలోకి లాగాలి అప్పుడుగాని తనలో పగ చల్లారదు అప్పుడుగాని ఈ మగ రాస్కెల్సుకు బుద్ధిరాదు. ఇందులో తన అందము ఆరోగ్యము—పరువు మర్యాదలు అన్నినాశనమయినాసరే—క్రోధము—ప్రతీకారం జంట సర్పాలై బుసలుకొట్టుతుంటే లెటర్ పాడ్ తీసి గబగబ వ్రాయసాగింది.

డియర్ సుధా

ఆ నాడు నిన్ను అంతగా తిరస్కరించి నీకుబాధ కలిగించినందుకు ఇప్పుడు ఎంతో పరితాప పడుతున్నాను. క్షమార్పణ కోరుతున్నాను. నీకు మనసారా స్వాగతమివ్వటానికి ఆతురత చెందుతున్నాను. నీ కోసం నా మనస్సు పూలపాన్పుచేసి పరచివుంచాను, ఈ నా వేడికోలు అందుకుంటూనే — ఇంకేమీ ఆలోచించకుండా వచ్చేయ్ సుధా, నీ కోసం వేయికన్నులతో ఎదురుచూసే

నీ సుజాత—

కాగితం మడిచి కవర్లో పెట్టింది. తను వద్దన్నా అతడి ఎడ్రసు రాసిన కాగితం తన పుస్తకాల్లో పెట్టేడు సుధాకరం ఆ ఎడ్రసు కోసం పుస్తకాలన్నీ వెదుకుతూంటే— డైరీలోంచి జగన్ ఫోటో జారిపడింది. ఆ ఫోటో చూస్తూనే మరింతక్రోధంతో పెట్రేగిపోతూ ఫర్రున చించబోయి క్షణం ఆ ఫోటోలోకి చూసింది. వెన్నెలలాటి చిరునవ్వులుచిందే అతడి మోము చూసేసరికి— పాలపొంగుమీద నీటిచుక్క చిలకరించినట్టుగా ఆమె కోపం చప్పున చల్లారిపోయింది. ఆ ఫోటో చేతిలోకి తీసుకుని కుప్పలా కూలిపోయింది. అది గుండెల కదుముకుని, చెంపలకు రాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది అతడిమీద కోపగించినందుకు—ఆ పరిస్థితి అతడు కల్పించినందుకు వేదనతో మనస్సు తల్లడిల్లిపోయింది. ప్రాణప్రదంగా ప్రేమించి—అతడే తన జీవితమని నమ్మి ఆరాధించిన ఇతడిమీదనా తనకు కోపం — ద్వేషం——?

వూహూ—లేదు—లేదు ప్రేమించిన ఆడది ద్వేషించలేదు, నేను ఆడదాన్ని — తల్లిగా ఆదరించి అభిమానించే మమతా పూర్ణమైన మనస్సు—

సోదరిగా వాత్సల్యాన్ని పంచి ఇచ్చే క్షమా హృదయం

ప్రేయసిగా—భార్యగా నిండుమనస్సుతో సేవించి, ప్రేమించి కోటి కోటి స్వర్గాల్ని చూపగలిగే అను గమయ హృదయం వకూ వున్నది ఆడదాని మనస్సు నవనీత సదృశం— ఇందులో కఠినత్వానికి తావులేదు మగవాడి తప్పిదాల్ని — దుష్టత్వాన్ని — అమ్మలాగా క్షమించి — సోదరిలాగా లాలించి — భార్యగా సేదదీర్చి అక్కున చేర్చుకుంటుంది—ఆడదానికి అంతులేని క్షమాహృదయం భగవంతుడిచ్చిన వరం అమూల్యమైన ఆ వరాన్ని తను వమ్ముచేయలేదు—లేదూ — లేదూ— జగన్ మీద కోపంలేదు — పగలేదు. అంతులేని బాధమాత్రమే వున్నది

అతడి సమక్షంలో తనుపొందిన అమూల్యామైన అనుభవాలు - అతడిచుట్టూ పెనవేసుకున్న మధురస్మృతులు తనని ఎప్పటికీ వదిలిపోవు. అతడిగాలి సోకితేనే మైమరచి పులకరించి- కౌగలించే కోర్కెలు అణువణువునా నిండి ఆత్రపడే తనువు — మరోమగాడి చేయి తనమీదపడితే తను సహించగలదా? ఎంత పిచ్చిగా ఆలోచించింది?

'జగన్ — జగన్ ఎందుకమ్మా ఇలా చేశావు?

ఇంత సమ్మోహనంగా నవ్వే ఈ అందమైన కళ్ళలో ఇంతకుటిలత్వం వున్నదనీ— తేనెలూరే ఈ పెదాల్లో ఇంత విషం వున్నదనీ అనుకోలేదు. ఈ విశాలమైన వక్షంలో నాకు చోటున్నదనీ—జన్మంతా నాకు రక్షణనిచ్చిఆదరిస్తుందని నమ్మేను,ఇప్పుడిది బండరాయికన్నా కఠినంగా మారిపోయింది ఎంత






తలబాదుకుని ఏడ్చినా ఇక కరుగదు—పోనీలే జగన్—నీవే సుఖపడు. నిన్ను ప్రేమించిన పాపానికి జన్మంతా కుమిలిపోతూ మోడు లాగా బ్రతుకుతాను. అయినా జగన్—నా జగన్ నీవులేని ఈ రంపపుకోత ఎల్లా భరించను? అబ్బా! గుండెల్లో మంటలు-తనువెల్లా మంటల్లో దహించుకుపోతూంది చల్లని నీచేతుల స్పర్శతోగానీ ఈమంటలు చల్లారవు. ఆ భాగ్యం ఇక ఈజన్మకులేదు—ఎంత దురదృష్టవంతురాల్ని! మంచంమీద పడి పొరలసాగింది

గడియారంలో ముళ్ళు తిరిగిపోతున్నాయి. పన్నెండు — ఒకటి — రెండు నిశిరాత్రి గడిచిపోతూంది నిదుర రావటం లేదు కణతలు పగిలిపోతున్నాయి— గుండెలు విడిపోతున్నంత బాధ —

మెల్లగాలేచి హాల్లోకి వచ్చింది సుజాత.

మెడికల్ జర్నల్ తిరగేస్తూ సోఫాలో కూచున్నాడు శేఖర్. 'ఇంకా నిద్రపోలేదు కాబోలు అన్నయ్య' అని వెనక్కు తిరగబోయింది సుజాత. అడుగుల సవ్వడికి తలెత్తి చూసి.

'ఏమమ్మా నిద్రపోలేదూ! జ్వరం కొంచెం తగ్గిందా?' అభిమానంగా అడిగాడు శేఖర్.

అన్నవాడిలో తల వాల్చుకుని ఏడవాలన్నంత ఉద్వేగ్నురాలై—అంతలోనే — నిగ్రహించుకుని —

'బాగా తలనొప్పిగా వున్నది — నిద్ర రావటంలేదు — నిద్రమాత్ర ఒకటి ఇయ్యి అన్నయ్యా' అన్నది.

'అల్మారాలో పచ్చసీసాలో వున్నాయి ఒక్కటే తీసుకోసుమా' అనేసి మళ్లీ పుస్తకంలో తలదూర్చేడు శేఖర్.

* * *

జగన్ ఫోటో చేతుల్లో పెటుకుని తదేకంగా చూస్తూ — పిచ్చిగా గొణుగుతూ— నిద్రమాత్రలు పంచదార బిళ్ళల్లాగా ఒకటొకటే చప్పరిస్తోంది.

'జగన్ నీమీద కోపం లేదు. ద్వేషం అంతకన్నాలేదు. నీతో గడిపిన ప్రతిక్షణం నాకు అమూల్యం — అదే నా బ్రతుక్కు శాంతి కలిగిస్తోంది.

ఇప్పుడు నన్నుకాదని దూరంగా వెళ్ళిపోయినా — ఒకప్పుడు నేనే నీకు సర్వస్వంగా భావించావు. అదే నాకు తృప్తి.

డబ్బుకోసం నన్ను నిరశించావు కదూ! పిచ్చి జగన్ ఆ రూపాయల్లో పడిపోల్లాడి—దానితో లభించే సుఖాలు నీవే జుర్రుకోవాయ్ జీవితాల్ని అశాంతి పాలుచేసి — అణగత్రొక్కేసే ఆ డబ్బొవద్దు — అందువలన లభించే సుఖమూ నాకు వద్దు. నీ స్మృతి మాత్రమే నా మనస్సుకు అంతులేని సుఖాన్ని ఇస్తుంది అది నాకుచాలు డియర్. ఒక్కసారి మనసారా ప్రేమించిన ఆడది — ఇంక ఏ పరిస్థితిలోనూ తన ప్రేమమూర్తిని ద్వేషించలేదు జగన్ — అదే ఆడదాని చేతకాని తనంగా—బలహీనతగా భావించి, వారి బ్రతుకుల్తో జూదమాడి మనసుల్ని మండించి కాలరాస్తున్నాడు మగవాడు — కానీ—కానీ — ఆడదంటే ఎవరు జగన్? మగవాడి మనస్సులో — తనువులో — జీవితంలో సగభాగం కాదా? తమలో భాగాన్ని తామే కష్టపెట్టుకుని — తమని తామే హింసించుకునే ఈ మగవాళ్ళు ఎంత పిచ్చివాళ్ళు? పిచ్చివాళ్ళనుచూసి జాలిపడాలిగాని — కోపంతో అసహ్యించుకోకూడదు ఎప్పటికైనా ఈ మగవాళ్ళు తమనితాము తెల్సుకుని — స్త్రీని ప్రేమమయిగా తమ జీవితాల్లో వెన్నెల కురిపించే పాలవెల్లిగా అనుభూతిచెంది, నిజమైన మనస్సుతో ఆప్యాయత నందివ్వ కలిగినప్పుడే జీవితాల్లో సుఖశాంతులు నెలకొంటాయి—కానీ - క్రూరత్వంతో — కరుడు కట్టినవారి మనస్సుల్ని కరిగించి — ఆర్ద్ర మనస్సుతో అనురాగ హృదయుల్ని గావించే ఆ సుదినం ఎప్పుడు? ఆ మార్పు తెచ్చేదెవ్వరో— ఎప్పటికో — ఏమో! ఈ లోపల ఎన్ని జీవితాలు భగ్నమైపోవాలో? అందుకే జగన్ నీమీద జాలితప్ప కోపంలేదు.

అబ్బ నీ స్మృతి నాకెంత హాయి గొల్పుతుందో తెల్సా?

చల్లని నీ వొడిలోవాలి — గులాబి మొగ్గల్లాటి నీ మధురాధరాల్లో చిందే గులాబి షాంపేన్ త్రాగినంత మత్తుగా — మధురంగా వున్నది.

నే మధురాధరాల్లో మధువు సేవించిన నేను అమరురాల్ని అయి ప్రేమారాధనలో దైవత్వాన్ని అందుకున్నాను. మానవ సహజ మయిన సుఖ — దుఃఖాలేవి నాకులేవు — నీ గురించిన మధురోహాలే నాకు ఆత్మశాంతి నిస్తాయి. ఇంక బాధలేదు — వేదపలేదు — క్రోధం అంతకన్నా లేదు — ఎప్పటికీ — నీవు ఎక్కడున్నా నావాడివే — కోరికలూరే పసిడి వయస్సులో—ఒకరికొకరం అర్పణఅయాం— ఇంక మనకి దూరమేమి వున్నది? లేదు కదూ —

డియర్ జగన్...మై డియర్ — మై డి...యర్—మై—డి యర్.

చేతిలో ఖాళీ స్లీపింగ్‌పిల్సు సీసా జారిపోయి, అస్తవ్యస్తంగా మంచంమీద వాలిపోయింది సుజాత. ●



# సినిమా

## శోభన్, జయలలిత విడిపోయారా?

డాక్టర్ బాబు, పల్లెపడుచు గౌరి పరస్పర అనురాగబద్ధులై స్వర్గ సుఖాలను అనుభవించ సాగారు తన ప్రేమ జ్యోతిని వర్ణిస్తూ, ఆనంద డోలికలలో వుయ్యాలలూగాడు డాక్టర్‌బాబు కాలచక్రమనేది పూలదారిలో నడుస్తుంది మధ్యలో ముళ్ళదారిలో తడబడుతూ నడుస్తుంది అలాగే వీరిపురి కలయిక ముళ్ళదారిలో పడింది పెంచిన తండ్రి శేఖర్ అంటే డాక్టరుతో పెళ్ళి అసంభవమని గౌరికి చెప్పాడు పరిస్థితులు విషమించి, డాక్టర్ ఆ పల్లెనే వదిలి వెళ్ళిపోతున్నాడు కలసిన మనసులు వూరుకుంటాయా? చేసిన బాసలు ఆగుతాయా? మంచివాడు తనను వదిలి వెళ్తుంటే, ఒంటరిగా ని పలేక, వెనకాలే పరుగిడుతూ విలపించింది

'విరిసే కన్నులలో వేయిబాస
లున్నవిలే
అవి నా గుండెలలో మూగవోయి
వున్నవిలే

అంటూ తమ గత స్మృతులను నెమరు వేయసాగింది గౌరి 'కట్' అన్నారు దర్శకుడు తెనిన్‌బాబు ఈ హృద్యమైన సన్నివేశం తమ్మారెడ్డి కృష్ణమూర్తి గారి 'డాక్టర్ బాబు' కలర్ చిత్రంలో కనిపిస్తుంది డాక్టరుగా శోభన్‌బాబు, అతడి ప్రేయసిగా జయలలిత నటించారు ఈ చిత్రానికి చలపతిరావు సంగీతసారథి.

### పాటల స్పెషలిస్టు!

పాటల చిత్రీకరణలో లెనిన్‌బాబు అద్వితీయుడు అన్న పేరును ఈ చిత్రం తెచ్చిపెడుతుంది 'దత్తపుత్రుడు' సమయాన కూడా, ఆ చిత్రంలోని నటీ, నటులు సరిగ్గా యిదేమాటను అన్నారు 'డాక్టర్ బాబు' చిత్రానికి మోదుకూరి జాన్సన్ మాటలను, నారాయణరెడ్డి, దాశరథి పాటలను, కన్నప్ప ఛాయను, సంజీవి కూర్పును, సూరన్న కళను నిర్వహిస్తున్నారు లక్ష్మి విడుదల. ఈ చిత్రంలో ఎస్వీఆర్, గుమ్మడి, రాజబాబు, రాజనాల, నాగేష్, విజయలలిత, లీలారాణి, శ్రీ వరలక్ష్మి ముఖ్య పాత్రధారులు

## భార్యా భర్తల సరసం!

పై ఆచార్య ఆత్రేయ ఒక అందమైన పాటను వ్రాశారు శ్రీ వాణీ కంబైన్స్ నిర్మించిన 'స్నేహబంధం' కోసం యీ పాటను రాయడం జరిగింది సత్యం సారథ్యంలో సుశీల, బాలసుబ్రమణ్యం పాడడం జరిగింది.

'స్నేహబంధం' లో భార్యా, భర్తలుగా జమున, కృష్ణ నటించారు వాళ్ళ సరసాన్ని ఆత్రేయ ఎలా వర్ణించాడో మీకు తెలుపుతాము

భార్య మోమోట పడకండి, మొగుడు
గారూ,
మీ మోజులన్నీ తీర్చేందుకున్నాను
భర్త మోమాట మేముంది పెళ్ళాం
గారూ,
నా మోజులన్నీ తీరకుంటే వూరుకోను.

ఈ పాటను తెరపై చూచినప్పుడు, ఆలు, మగలు అంటే యిలా వుండాలేమో అన్నంత సహజంగా చిత్రీకరించారు, చంద్రశేఖర రెడ్డి

### జులై 20న విడుదల!

స్నేహబంధం ఎంత మధురమైనదో, ఎంత గొప్పదో యీ చిత్రం తెలుపుతుంది. కథను నిర్మాత సుబ్బరాజు వ్రాయ, మాటలను దాసరి నారాయణరావు రచించారు కృష్ణ, గుమ్మడి, కృష్ణంరాజు, సత్య



'మమత'లో జమున.



నారాయణ, రాజబాబు, అల్లు రామలింగయ్య, రావు గోపాలరావు, జమున, లీలారాణి, రమాప్రభ, రాధాకుమారి ముఖ్య పాత్రధారులు. జమున యింత రొమాంటిక్‌గా, మరే చిత్రంలోనూ యింతవరకు కనిపించలేదు అన్నభావం 'స్నేహబంధం' కలిగిస్తుంది బి అచ్యుతరామరాజు సమర్పించు యీ చిత్రం జులై 20న అన్నపూర్ణా ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది

## పల్లెటూరి బావ

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన చిత్రం యిది ప్రత్యగాత్మ దర్శకత్వంలో సర్వాంగ సుందరంగా తయారైన యీ చిత్రానికి చలపతిరావు సంగీతాన్ని సెల్వరాజ్ ఛాయను, జి వి, సుబ్బారావు కళనూ కృష్ణస్వామి కూర్పును నిర్వహించారు. ఏ. వి సుబ్బారావు నిర్మించిన యీ చిత్రం సారథి స్టుడియోలో షూట్ చెయ్యబడింది. కథను పాఠకులకు సంగ్రహంగా తెలుపుతున్నాను

ఏడుకొండలు వుత్సాహవంతుడైన పల్లెటూరి యువకుడు సీతాపురం గ్రామానికి పెద్ద అతని మేనమామ భీరావు, మేనత్త దీపలక్ష్మి, వాళ్లకు ఒక్కగానొక్క కుమార్తె వుంది. పేరు లలిత, లండన్‌లో చదువుకుంది నవనాగరికపు అలవాట్లకు లోనైంది.

లలితకు ఏడుకొండలు వచ్చాడు తాగుబోతు మధు బారినుండి, ఏడుకొండలు తప్పించాడు లలిత ఏడుకొండల్ని ప్రేమించి పెండ్లి చేసుకుంది ఈ వివాహం యిష్టం లేని దీపలక్ష్మి యీ బంధాన్ని భగ్నం చేయడానికి, సమయంకోసం ఎదురుచూస్తోంది

లలిత పుట్టిన రోజుకు బస్తీనుండి స్నేహితులు వచ్చారు వచ్చినవాళ్లు తాగి తందనాలు ఆడారు అప్పుడే వచ్చిన ఏడుకొండలకి ఒళ్లు మండింది అతిథుల్ని, లలితను చావబాదాడు, లలిత అలిగి పుట్టింటికి పారిపోయింది

అదను చిక్కిన దీపలక్ష్మి, అల్లుడికి విడాకులు నోటీసు పంపించింది అది చూసి రెచ్చిపోయిన ఏడుకొండలు, 'వారం రోజుల్లోగా తన భార్య [illegible] యింటిగడప తొక్కకపోతే అందర్నీ పోలేరమ్మకు బలియిస్తానని' హెచ్చరించాడు

దీపలక్ష్మి లెక్కచెయ్యలేదు సరికదా, హైదరాబాదుకు మకాం మార్చింది ఏడుకొండలు మారువేషంలో లలితను కలిశాడు ఫలితంగా లలిత గర్భవతి అయింది. పుట్టిన శిశువును అగాధ శరణాలయంలో వదిలేసింది, దీపలక్ష్మి ఏడుకొండలకు, మేనకోడలు రంగితో వివాహం నిశ్చయమైంది. లలిత ఏమైంది? భర్తతో కాపురం చేసిందా? కన్నబిడ్డను దక్కించుకుందా? అనేడి ప్రశ్నలకు సమాధానం 'పల్లెటూరి బావ' చిత్రం చూస్తే తెలుస్తుంది.

## న్యాయం జయించింది!

పాఠకులకు గుర్తుందనుకుంటాను, 'మీనా' నవల వ్యవహారం.

ప్రముఖ నవలా రచయిత్రి యద్దనపూడి సులోచనారాణి విరచితమైన 'మీనా' నవలను ప్రసిద్ధ నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావుగారి వద్దనుండి, నందిపీ ఫిలింస్ రమణయ్య కొన్నారు

'ఇల్లు — ఇల్లాలు' చిత్రాన్ని సమర్పించిన కె సుబ్బిరెడ్డిగారు, రమణయ్య నిర్మాతగా ఒక చిత్రాన్ని తలపెట దలచినట్టు పత్రికకు న్యూస్ యిచ్చారు, నాలుగుమాసాల క్రితం

ఆ తలంపుతోనేమో, రమణయ్యచేత 'మీనా' హక్కులను కొనితెమ్మని' హైదరాబాదుకు పంపారు కథను కొనడం జరిగింది రమణయ్యకు, సుబ్బిరెడ్డికి మనస్పర్ధలు వచ్చినట్టున్నాయి ఇద్దరు వేర్వేరుగా విడిపోయారు.

తన్ను కాదని, విడిపోయిన రమణయ్య



'డాక్టర్ బాబు'లో శోభన్ బాబు, జయలలిత

# సినిమా

మీద ఎన్ని చెయ్యాలో అన్నీ చేశాడు, నందినీ ఫిలింస్ చిత్రాల సమర్పకుడు.

ఎటూ తోచని పరిస్థితికి గురిఅయిన పి వి రమణయ్య, హీరో కృష్ణ సహాయాన్ని అర్థించాడు. ఆపదలోవున్న వాళ్లను ఆదుకునే మనస్తత్వం గొప్ప కృష్ణ 'మీనా' చిత్ర నిర్మాణానికి తన సహకారాన్ని యివ్వడానికి అంగీకరించారు. తత్ఫలితమే విజయకృష్ణ ఫిలింస్ అవతరణ జరిగింది. న్యాయం జయించింది

విజయకృష్ణ ఫిలింస్‌కి పి వి రమణయ్య అధినేత అయ్యాడు 'హీరో కృష్ణకు ఋణపడి యుంటాము', అన్నాడు యిటీవల కలిసినప్పుడు రమణయ్య

*సగం అయింది!*

'మీనా' చిత్రం షూటింగు జూన్ 11 నుండి, నెలాఖరు వరకు ఏ వి ఎమ్ స్టుడియోలో నిర్విరామంగా జరిగింది దర్శకత్వం వహిస్తున్న విజయనిర్మల ఆ శాఖలో ఎంత సమర్థురాలో అర్థమైంది ప్రతి షాటును నీటుగా తీస్తూ, నెగటివ్‌కు తావు యివ్వకుండా, బెస్టు రిజల్ట్సు రాబట్టుకుంటూ వుంది. ఆమెను స్త్రీ దర్శకురాలిగా మన ప్రేక్షకులు ఆమోదించగలరన్న నమ్మకం నాకు ఏర్పడింది. మొదటి షెడ్యూలులో సగం చిత్రం తయారైంది

*నాయిక ఆమే!*

దర్శకత్వం చేపట్టిన విజయనిర్మలే 'మీనా' పాత్రను పోషిస్తూ వుంది. ఇంతవరకు విజయనిర్మల వేసిన వేషాలకు, యీ వేషానికి ఎంతో వ్యత్యాసంవుంది ఆమె నట జీవితంలో కొత్త బాటను చూపించే పాత్ర యిది. ఆమెతోబాటు కృష్ణ, జగ్గయ్య, చంద్రకళ, ఎస్వీరలక్ష్మి, రాజబాబు, రమాప్రభ, అల్లు రామలింగయ్య, సాక్షిరంగారావు, సూర్యకాంతం, ఛాయాదేవి ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు.

*గుమ్మడి ఆగమనం!*

'మీనా'లో గుమ్మడి నటిస్తున్నట్టు మొదట్లో చెప్పారు, రమణయ్య. తర్వాత ఆ పాత్రను ఎస్వీరంగారావు ధరిస్తున్నట్టు పత్రికా ప్రకటన యిచ్చారు, రమణయ్య. ఇప్పుడు గుమ్మడి ఆ భూమికను నిర్వహిస్తున్నట్టు రమణయ్య చెప్పారు.

*అప్పలాచార్య అదృష్టం!*

'మీనా'లాంటి మంచి కథకు సంభాషణలు సమకూర్చే అదృష్టం అప్పలాచార్యకు లభించింది ఎన్నాళ్లనుండో, ఎన్నో చిత్రాలకు తన కలం మహిమను అజ్ఞాతంగా చూపెట్టిన, బాలసముద్రాలకు (అప్పలాచార్య) యిప్పటికి తన ప్రతిభా సంపత్తిని బాహాటంగా వెల్లడించే అవకాశం లభించింది.

అప్పలాచార్య, ఉత్తమ రచయితల పట్టీలో చేరేరోజు దగ్గర్లోనే వుందని. 'ఇన్‌స్పెక్టర్ భార్య' చిత్రం చూచినప్పుడు, అప్పలాచార్య కలానికి ఎంత పదునువుందో తెలుసుకొన్నాను మనస్సులోని మాటను పాఠకులకు అప్పుడే తెలిపాను. నేను చెప్పిన 18 మాసాలకల్లా, అప్పలాచార్యకు యీ మహదవకాశం లభించింది.



నటి వాణిశ్రీ
(చిత్రకారుడు శ్రీ నవీన్‌కుమార్)

*మరి రెండు చిత్రాలు!*

అప్పలాచార్య చేత మాటలను రాయించడానికి మరిద్దరు నిర్మాతలు సుముఖంగా వున్నారు ఒకరు కృష్ణకిశోర్ ప్రొడక్షన్స్ అధినేత శేఖర్‌బాబు మరొకరు విక్రం ప్రొడక్షన్స్ రంగాగారు రెండు చిత్రాల్లోనూ కృష్ణ నాయకుడిగా నటిస్తారు

ఇకపై, అప్పలాచార్య యితరులకు సహాయపడేటప్పుడు, రచయితగా తన పేరు కూడా వుండాలి అని కోరడం సమంజసం.

## కృష్ణతో వాణిశ్రీ!

జంటగా నటించే కొత్త చిత్రాన్ని లక్ష్మీ చిత్ర తలపెట్టారు. ఈ సంస్థను ఉయ్యూరు వాస్తవ్యులు స్థాపించారు. థియేటరు వుంది వీళ్లకు ఈ సంస్థ ఒక సముజ్జ్వల సాంఘికాన్ని నిర్మించబోతున్నారు 'ప్రేమనగర్' ఫేమ్ కె. ఎస్. ప్రకాశరావుగారిని దర్శకుడిగా పెట్టుకొన్నారు



'స్నేహబంధం'లో జమున, కృష్ణ, వరళ.

మరి ఏ ఇతర
పద్ధతిలోనూ మీ
మరుగు దొడ్డిని ఇంత
పరిశుభ్రంగా చేయలేరు.

# శానిఫ్రెష్ రాత్రివేళ కొద్దిగా చల్లండి.




**అది వికృతమైన మరకలను మాయంచేస్తుంది.**

**కష్టపడనక్కర లేకుండానే అది మీ మరుగుదొడ్డిని తళతళలాడేటట్లు చేస్తుంది.**

**అది మీ కుటుంబ ఆరోగ్యానికి రక్షణచేకూరుస్తుంది**

**బల్సారా**
—సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు
BALBARA బల్సారా అండ్ కంపెనీ (ప్రై.) లి.
43, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001.

CHAITRA-BLS 8 TEL

ఆయునకు గొల్లపూడిని రచయితగా, చక్రవర్తిని సంగీత సారధిగా, కుదరవల్లిని కళాదర్శకునిగా నియమించడం జరిగింది సహాయ దర్శకత్వాన్ని ప్రకాశరావుగారి కుమారుడు చిరంజీవి రాఘవేంద్రరావు నిర్వహిస్తారు.

## శోభన్‌తో చంద్రకళ!

జంటగా నటించే వర్ణచిత్రాన్ని కౌముదీ పిక్చర్స్ నిర్మిస్తున్నారు కన్నడంలో బహుళ ప్రచారం పొందిన 'నాగర్ కోల్' చిత్రాన్ని 'కోడెనాగు' పేరిట, నిర్మాత ఎం ఎస్ రెడ్డి భారీఎత్తున తయారుచేస్తున్నారు 'తాసిల్దారుగారమ్మాయి' ఫేమ్ కె ఎస్ ప్రకాశరావు యీ చిత్రాన్ని డైరెక్టు చేస్తున్నారు.

ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ మాటలు, కొన్ని పాటలను వ్రాశారు ఆయన ఒక ముఖ్య భూమికను నిర్వహించడం యిందులోని ప్రత్యేకత. కె ఎస్ ప్రసాద్ ఛాయాగ్రహణాన్ని పెండ్యాల సంగీతాన్ని నిర్వహిస్తున్నారు

*చంద్రగిరిలో షూటింగు:*

'కోడెనాగు' చిత్రం షూటింగు జూన్ 16 నుండి చంద్రగిరి కొండల్లో పక్షం రోజులుపాటు జరిగింది ఈ షెడ్యూలుతో సగం చిత్రం పూర్తయినట్టే, అన్నారు నిర్మాత ఎం ఎస్ రెడ్డి

*గెస్టుగా జగ్గయ్య!*

ఈ చిత్రంలో క్యారెక్టర్ నటుడు జగ్గయ్య గెస్టుపాత్రను పోషిస్తున్నారు ముఖ్య భూమికలను లక్ష్మి, రాజబాబు, సూర్యకాంతం, ధూళిపాళ, అల్లు రామలింగయ్య, ముక్కామల, నిర్మల, శ్రీరంజని ధరిస్తున్నారు విజయా పిక్చర్స్ విడుదల

## ఇద్దరూ వున్న చిత్రం!

విజయా పిక్చర్స్ విడుదలచేసే మురుగన్ బ్రదర్స్ వారి 'పుట్టినిల్లు — మెట్టినిల్లు' చిత్రం జులై రెండవ వారంలో ఆంధ్ర ప్రేక్షకులను దర్శించబోతూంది ఈ చిత్రానికి పట్టు దర్శకుడు.

*పట్టు దర్శకత్వం!*

గూర్చి తమిళపత్రికలు గొప్పగా వ్రాశాయి, 'పుగుందవీడు' చిత్రం విడుదలయినప్పుడు. ఆ కథయే యీ 'పుట్టినిల్లు మెట్టినిల్లు' చిత్రం అందుకే ఆయన్నే డైరెక్టరుగా పెట్టారు, తెలుగు ప్రతికికూడా. ఈ చిత్రానికి ఎస్ ఆర్ నంది మాటలను, సత్యం సంగీతాన్ని, మారుతీరావు ఛాయను నిర్వహించారు ఈ చిత్రంలో యిద్దరు హీరోలు వుండటం ఒక విశేషం.

*కృష్ణ – నాగయ్య!*

'పుట్టినిల్లు — మెట్టినిల్లు' చిత్రంలో కృష్ణ ధరించిన పాత్ర 'రక్తసంబంధం' లో నటరత్న పోషించిన దానితో సమానమైనది. గారాబంగా పెరిగిన చెల్లెలికోసం ఎలాంటి త్యాగానికయినా వెనుకాడని పాత్ర ఆయనది ఆయన తండ్రిగా నాగయ్య, చెల్లెలిగా లక్ష్మి నటించారు

*శోభన్ – సావిత్రి*

'పుట్టినిల్లు – మెట్టినిల్లు' చిత్రంలో శోభన్ ధరించిన పాత్ర చాలా వుదాత్తమైనది తల్లికోసం తాళికట్టిన దానిని కూడా తిరస్కరించి తల్లిని మించిన దైవం యిలలేదు అని నిరూపించిన చక్కటిపాత్ర ఆయునది. ఆయున తల్లిగా సావిత్రి, చెల్లెలిగా చంద్రకళ నటించారు

*రాజబాబు ద్విపాత్రాభినయం*

ఈ చిత్రంలో రాజబాబు తండ్రి, కొడుకుగా ద్విపాత్రాభినయం చేశాడు ఆయున సరసన రమాప్రభ నటించింది

రాజబాబు ఒకపాత్ర నటించినప్పుడే, ప్రేక్షకులు అతడికి బ్రహ్మరథం పడుతున్నారు ఇక, రెండు వేషాలు వేసినప్పుడు, ప్రజలు ఎంతగా అభిమానిస్తారో!

తమిళంలో వందరోజులు ఆడిన చిత్రం యిది సెంటిమెంట్సు అందరికీ ఒక్కటే గాబట్టి తెలుగులోకూడా విజయాన్ని పొందవచ్చు.

## చంద్రకళ అలక

అందమైన ఆడపిల్ల అలుక వహించిందంటే, ఎంతటి మగవాడైనా దాసోహం అనకతప్పదు, ఆమెను దరిచేరి ముద్దుమాటలతో మురిపించకా తప్పదు.

అన్యోన్యానురాగబద్ధులైన భార్యాభర్తల మధ్య దాచడాలు, దాపరికాలు వుండరాదు. కృష్ణ, చంద్రకళ ఆదర్శదంపతులుగా నటి



'కవిహృదయాలు'లో చంద్రకళ, కృష్ణ

మందిచేత ప్రశంసించబడుతున్నారు భార్యాభర్తలు ఒకర్ని విడిచి మరొకరు ఒక్కక్షణం అయినా వుండలేరు

ఆ దంపతులమధ్య కాస్సేపు మౌనం ఆవరించింది చంద్రకళ కోపంగావున్నట్టు కృష్ణ పసిగట్టాడు

'ఏదో మనసులో దాచుకుని బాధపడే బదులు, బైటపెట్టి మమ్మల్ని కాస్త నవ్వించకూడదూ,' అన్నాడు 'దాచుకునే అలవాటు మీకే,' అంది చంద్రకళ 'నాకా?' అని పెదవి చప్పరించాడు కృష్ణ 'కట్' అన్నారు దర్శకుడు ఎం మల్లికార్జునరావు ఈ దృశ్యం నవచిత్ర ప్రొడక్షన్స్‌వారి 'పసి హృదయాలు' చిత్రంలో కనిపిస్తుంది,

ప్రేమించి పెండ్లాడిన భార్యకోసం, ఏమ్మైనా చెయ్యగల డాక్టర్ వేణు, మగజాతికే ఒక మకుటం ఆ పాత్రను కృష్ణ గొప్పగా పోషించాడు. అయన భార్య రాధగా చంద్రకళ చక్కగా నటించింది ఈ చిత్రం నవయుగద్వారా విడుదలవుతుంది

## శేఖర విజయం!

'శారద' విజయంతో, జోతీ శేఖర్ బాబుకు మహర్దశ ప్రారంభమైంది అవే చెప్పాలి ఈ చిత్రానికి ఎక్కువ డబ్బు యివ్వడానికి ముందుకొచ్చిన మనిషి శేఖర్‌బాబు, ఇప్పుడు అతడార్జించిన దాన్ని చూచి అసూయ పడితే ఎలా?

ఆయనొక కథ వ్రాయడం జరిగింది పేరు 'మమత' కృష్ణకిశోర్ ప్రొడక్షన్స్ పేరిట ఆ కథను చలన చిత్రంగా నిర్మించారు, జమున ముఖ్యపాత్రను పోషించిన యీ చిత్రానికి పి చంద్రశేఖరరెడ్డి దర్శకుడు మాటలను పినిశెట్టి, సంగీతాన్ని మహదేవన్ సమకూర్చారు. కృష్ణ కథానాయకుడు,

*జమున గమ్మత్తుకల!*

'మమత' నాయిక జమునకు కలవచ్చింది ఆ కలలోకి కథానాయకుడు వచ్చాడు అతగాడ్ని చూచి, పరవశం చెందింది తియ్యని వెన్నెలరేయి అనిపించింది

'విన్నదాకా నేను నేనే, మవ్వు నువ్వే!
నేటినుంచీ నువ్వే నేను, నేనే నువ్వు!'

అంటూ కలవరించసాగింది. ఈ పాటను ఆచార్య ఆత్రేయ వ్రాశారు సుశీల, రామకృష్ణ పాడారు ఈ స్వప్న దృశ్యాన్ని కొడైకెనాల్‌లో చిత్రీకరించడం జరిగింది, ఈ చిత్రానికి జి కె రాము ఛాయాగ్రాహకుడు. జోతీద్వారా విడుదలయ్యే ద్వితీయ చిత్రం యిది, డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు పునరుద్ధరింపబడిన తర్వాత

## భవానీ ఆర్ట్ పిక్చర్స్!

అనే చిత్ర నిర్మాణ సంస్థను హైదరాబాదుకు చెందిన పి నాగభూషణం స్థాపించారు వీరొక సమస్యాత్మక సాంఘిక కథను ఎన్నుకొన్నారు విప్లవ రచయిత మోదుకూరి జాన్సన్‌చేత మాటను వ్రాయిస్తున్నారు సంగీతానికి సత్యాన్ని పెట్టుకున్నారు ఇక దర్శకత్వం అంటారా? 'మానవుడు-దానవుడు, ఇల్లు ఇల్లాలు, బడిపంతులు' చిత్రాల విజేతఅయిన పి చంద్రశేఖరరెడ్డికి యిచ్చారు

## అశోక్‌కుమార్‌గా ఎస్వీఆర్!

'విక్టోరియా 203' హిందీ చిత్రంలో అశోక్‌కుమార్ ధరించిన పాత్రను తెలుగులో ఎస్వీరంగారావుకు యిచ్చారు వల్లభనేని ప్రొడక్షన్స్ అధినేత ఆనందబాబుగారు. తెలుగుకూడా ఈస్ట్‌మన్‌కలర్‌లో నిర్మించబడుతుంది

*ప్రాణ్ పాత్రలో నాగభూషణం!*

అదే చిత్రంలో ప్రాణ్ వేసినవేషాన్ని, తెలుగులో నాగభూషణం చేత వేయిస్తున్నారు, నిర్మాత ఈ చిత్రానికి భమిడిపాటి రచయిత

*రాజేంద్రప్రసాద్!*

'దసరాబుల్లోడు, బంగారుబాబు' చిత్రాలను చూచిన ప్రేక్షకులందరూ జగపతి అధినేత దర్శకత్వాన్ని గొప్పగా చెప్పారు ఆయనే యీ చిత్రాన్ని డైరెక్ట్ చేస్తున్నారు

*శోభన్ - లక్ష్మి!*

ఆద్యంతం హాస్యరసం కలిగించే 'విక్టోరియా 203' చిత్రంలో నాయకీ, నాయకులుగా లక్ష్మి, శోభన్ నటిస్తున్నారు ఈ చిత్రానికి వెంకటరత్నం ఛాయను, కృష్ణారావు కళను, మహదేవన్ సంగీతాన్ని, సంజీవి కూర్పును నిర్వహిస్తారు

హిందీలో అఖండ విజయాన్ని సాధించిన 'విక్టోరియా 203'ని, ఎవ్వరు తీసినా, ఏ భాషలో వచ్చినా, ప్రేక్షకులకు అవసరమైనవినోదాన్ని కలిగించే కథాంశం గొని యున్నందువల్ల, విజయం తథ్యం.



'పల్లెటూరిబావ'లో లక్ష్మి. నాగేశ్వరరావు.

## తమిళంలో

### మానవుడు—దానవుడు

తెలుగునాట బ్యానర్ వేల్యూ సంపాదించిన, జగపతి పిక్చర్స్‌కి తమిళనాటకూడా పేరు, ప్రఖ్యాతులు తెచ్చేవిధంగా 'మానవుడు - దానవుడు' తమిళ చిత్రం తయారైంది.

తెలుగు తమిళ చిత్రాలను చూచిన ఒక జర్నలిస్టు అన్నాడు తెలుగుకి తమిళానికి ఎంతో తేడా వుంది, తెలుగుకన్నా తమిళం మిన్నగా నిర్మించబడింది. శివాజీగణేశన్ అద్భుతంగా నటించారు. 'షావుకారు' జానకి ప్రేక్షకులచేత కన్నీరు కార్పించే విధంగా నటించింది. డైరెక్షన్ 'ఏ' వన్. ఈ చిత్రం మినిమమ్ 175 రోజులు ప్రదర్శింప బడుతుంది. ప్రేమ్‌నగర్ తర్వాత శివాజీ అద్వితీయంగా నటించిన చిత్రం యిది.' ఇలాంటి మాటలే చిత్రాన్ని చూచిన ప్రతివారూ అంటున్నారు. జులై 14న విడుదల.

### నవలా చిత్ర నిర్మాత!

**ప్రసిద్ధ తెలుగు నవలలను, చలన చిత్రాలుగా నిర్మించి, ప్రజల మెప్పును పొందిన నిర్మాతగా సురేష్ అధినేత రామా. నాయుడు గారిని పేర్కొనవచ్చు.**

ఆయన నిర్మించిన 'ప్రేమనగర్, జీవన తరంగాలు' ఎంతటి విజయాన్ని సాధించాయో ప్రేక్షకులకు తెలియనిది కాదు. 'ప్రేమనగర్' కావ్యాన్ని తెలుగు వాళ్లకు మాత్రమే పరిమితం చెయ్యకుండా తమిళ, హిందీ వాళ్లకుకూడా చవిచూపించే రామా నాయుడు అభినందనీయుడు. 'జీవన తరంగాలు' తమిళంలో నిర్మింపబడుతుంది.

*మధుసూదనరావుగారి స్తే...*

తెలుగు నవలయొక్క మజాను ప్రేక్షకులకు మొట్టమొదట తెలియచేసిన వ్యక్తి దుక్కిపాటి మధుసూదనరావుగారు. ఆయన నిర్మించిన 'డాక్టర్ చక్రవర్తి, విచిత్ర బంధం' మరపురాని మధుర కావ్యాలుగా నిలిచి యుంటాయి. ఆయన దగ్గర మరొక మహత్తరమైన నవల వుంది. ఆ నవలపేరు 'సెక్రటరి', యద్దనపూడి సులోచనారాణి వ్రాసిన నవల లన్నిటిలోకి ఎక్కువ ప్రచారం, పాఠకుల ఆదరం పొందినది 'సెక్రటరి' అంటే తప్పు లేదనుకుంటా.

'శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు అనవలను యిస్తే, సురేష్ మూవీస్ ఈస్ట్‌మన్ కలర్‌లో తీయడం జరుగుతుంది.' అన్నారు రామా నాయుడు.

## సినిమా

*నాగేశ్వరరావు. వాణిశ్రీ!*

'సెక్రటరి' చదువుతున్నప్పుడు, రచయిత్రి నాగేశ్వరరావు, వాణిశ్రీని మనస్సులో పెట్టుకుని వ్రాసినదా అన్నభావం పాఠకులకు జనిస్తుంది. రామా నాయుడు తీయనున్న చిత్రంలో పాఠకులకు ఊహించుకునే. నాగేశ్వరరావు, వాణిశ్రీల చేతనే పాత్రలను వేయిస్తాడు. ఆచార్య ఆత్రేయ యీచిత్రానికి రచయితగా బాధ్యతను స్వీకరించారు.

### ఖైదీ బాబాయ్!

శ్రీ బాలాజీ చిత్ర ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన చిత్రానికి యీ పేరు పెట్టడం జరిగింది. ఈ పేరు నాలుగు మాసాల్కితం నేనే వ్రాశాను. అప్పుడు కొందరికి కష్టం కలిగింది. 'పరివర్తన'గా పత్రికా ప్రకటన యివ్వడం జరిగింది. చివరకి, నేను వ్రాసిన పేరునే స్థిరపరచడం జరిగింది. ఎడిటరు టి. కృష్ణ దర్శకత్వం నెరపిన యీ చిత్రంలో శోభన్, షావుకారు జానకి, వాణిశ్రీ, జగ్గయ్య ముఖ్యపాత్రధారులు. ఈ చిత్రానికి 'దు'తో ప్రారంభమయ్యే ఒక హిందీ చిత్రం మూలం. లక్ష్మి విడుదల.

### సంసారం—సాగరం

'తాత—మనవడు' చిత్రం అసాధారణ విజయాన్ని సాధించింది. ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌కి ప్రజల్లో విలువ పెరిగింది. క్రైం చిత్ర నిర్మాత రాఘవకి ఫ్యామిలీ సబ్జెక్ట్ నిర్మాత అన్న పేరు వచ్చింది. ఆయనతోబాటు కథకుడు, దర్శకుడు అయిన దాసరి నారాయణరావుకు పేరు, ప్రఖ్యాతులు లభించాయి. ఆంధ్రప్రదేశ్ ముఖ్యకేంద్రాలయిన హైదరాబాద్ విజయవాడ, తిరుపతి నగరాల్లో శత దినోత్సవ సంరంభం బ్రహ్మాండంగా జరిగింది.

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి రెండవ చిత్రం 'సంసారం — సాగరం' కథను నేను వినడం జరిగింది. కథకుడు దాసరి చిత్రంలోని సంఘటనలను, సన్నివేశాలను చెపుతున్నప్పుడే, గుండెలు కదిలాయి. కళ్లు చెమ్మగిల్లాయి. 'తాత—మనవడు'కన్నా వంద రెట్లు మిన్నగావున్న కథ 'సంసారం—సాగరం' అనిపించింది. ఈ చిత్రానికి సినిమా అనుకరణ మాటల రచన + దర్శకత్వ నిర్వహణనుకూడా నారాయణరావు చేపట్టారు.

*వెరైటీ వేషాలు!*

'సంసారం—సాగరం'లో ఎస్వీరంగారావు, గుమ్మడిగార్లవి వెరైటీ వేషాలు. కాబూలీవాలాగా రంగారావు, పెండ్లిని నిరసించే మనిషిగా గుమ్మడి నటిస్తున్నారు. ముఖ్య పాత్రలను జయంతి, శుభ, రాజబాబు, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, మంజుల పోషిస్తారు. రమేష్ సంగీతసారధి. జూలై 20 నుండి షూటింగు. తారకరామ విడుదల,

### నలుగురు గొప్పవాళ్లు!

ప్రజల్లో మార్పు కనిపిస్తూ వుంది. మంచి చిత్రాలేమిటి? కానివేమిటి? అని నిర్ణయించుకుంటున్నారు మన ప్రేక్షకులు. మంచివాటికి మాత్రమే వెడుతున్నారు. పెద్దతారలను చూచి, మోజుపడి సినిమాకు పోయే రోజులు పోయాయి.

ఈ ఏడు, మన ప్రజలు నలుగురిని గొప్పవాళ్లుగా నిర్ణయించారు. ఆ నలుగురు ఎవరంటే? 'ఇల్లు—ఇల్లాలు' దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి, 'తాత – మనవడు' నిర్దేశకుడు దాసరి నారాయణరావు, 'జీవన తరంగాలు' డైరెక్టరు తాతినేని రామారావు, 'శారద' దర్శకుడు కె. విశ్వనాథ్. ఈ నలుగురూ ఆయా చిత్రదర్శకత్వంలో ఎంత కృషిచేసిరో ప్రేక్షకులకు తెలిసింది. నాలుగు కథలూ నావల్టీవున్నవే. నాలుగు చిత్రాలకు దర్శకులు తీసుకున్న శ్రద్ధ, ఆసక్తి సామాన్య ప్రేక్షకుడికికూడా అర్థమైంది.

'ప్రజావాక్కు బ్రహ్మవాక్కు', అంటారు. వారిచ్చిన వాక్కును పదికాలాలపాటు దక్కించుకోవలసిన బాధ్యత నలుగురిపై వుంది; మార్కెట్టు వచ్చిందిగదా అని, ప్రతి దానిని అంగీకరిస్తే, ఏ ఒక్కదానిపైన దృష్టిని కేంద్రీకరించలేక, పరాజయం, ప్రజాశాపం పొందవలసి వస్తుంది. ఈ నలుగురూ 'నిలబడి నీళ్లుత్రాగే మనస్తత్వం గొన్న వాళ్లే.'

—శ్రీనివాస్ ●



# సూర్యుడు కూడ ఉదయిస్తాడు...

ప్రత్యేక నగరమైన దావణగెరె మైసూర్ యొక్క ప్రతి మండలము—నంది వృషభము యొక్క స్థలము.

నలుబది సంవత్సరాల క్రితం, లోకవార్తి పొందిన స్వ॥ ధర్మ ప్రవక్త హనుమంతప్ప దావణగెరె కాటన్ మిల్లులను ప్రారంభించారు.

ఈ నాడు, మైసూరులో ప్రఖ్యాతిగాంచిన మిల్లులలో ఇది ఒకటి. నాణ్యమైన బట్టలను ఉత్పత్తి చేయుట, ఇండియా అంతటిలో అమ్మబడుట మరియు ఎగుమతి చేయబడుట, అనేక వేల మందికి లాభదాయకమైన ఉపాది కల్పన చేయుచున్నది.

**దావణగెరె**
బట్టలు

*ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్*
*—సాంప్రదాయముగా రమణీయ సౌందర్యమును సమకూర్చును!*



Thomas/DCM/8e/TL

# సినిమా బ్యూటీ బులెటిన్

లేక

# అందానికి చిట్కాలు

**అందాల తార సిమీ అందానికి, ఫాషన్‌కి తగిన చిట్కాలు తెలుపుతుంది. వ్యక్తిగత మైయిన ప్రశ్నలకి సమాధానాలు ఇవ్వలేనని తెలుపటానికి ఆమె చింతిస్తోంది! సాధారణంగా అందరికీ ఉపయోగంగా ఉండే ప్రశ్నలనే 'SIMI'S BEAUTY BULLETIN, Post Bag No. 7117, BOMBAY 400014 కి పంపవచ్చు.**

ప్ర: నా శరీరం అంతకంతకు నల్లబడుతున్నది. బహుశా నేను స్విమ్మింగ్‌చేసే నీళ్లు వుప్పనివి కావడంవల్లనేమో అని నా అనుమానం. నా శరీరం రంగు కాంతివంతం కావాలంటే నేనేం చెయ్యాలి?

జ: స్విమ్మింగ్ నీళ్లు ఉప్పనివి అని మీకుతోస్తే—1. వెంటనే వేన్నీళ్ల స్నానం గాని షవర్‌బాత్ గాని చెయ్యండి 2. లనోలిన్ ఎక్కువగావున్న క్రీమ్‌ని, లోషన్‌ని శరీరానికి పట్టించినా శరీరం రంగు బాగుంటుంది.

ప్ర: నేను కళ్లజోడు ధరిస్తాను. కాని, ఇష్టముండదు. ముఖానికి బాగావుండే ఫ్రేములని వేటినయినా మీరు చెప్పగలరా? కాంటాక్టు లెన్సులు నా కళ్ళకి పడవు.

జ: ఏ ముఖానికి సరిపడా ఫ్రేములు ఆ ముఖానికి వాడాలి. ఇపుడు చాలారకాలయిన ఫ్రేములు వస్తున్నాయి. మరో ముఖ్యమైన విషయం ఏమిటంటే మీ హెయిర్ స్టయిల్ కూడా బాగా కుదరాలి. మీ హెయిర్ డ్రెస్సర్ దగ్గరికి వెళ్లేప్పుడు మీ కళ్లజోడు కూడా తీసుకువెళ్లండి. అప్పుడు వాళ్లు చక్కగా హెయిర్ డ్రెస్సింగ్ చేస్తారు.

ప్ర: నా ముక్కు చాలా పెదది. చిన్నది కావడానికి ఏదైనా పద్ధతివుందా! ఖరీదయిన కాస్మెటిక్ సర్జరీ చేయించుకోలేను.

జ: రెండు షేడ్స్ వున్నాయి. వాటితో మేకప్ చేస్తే సరిపోతుంది. మరీ పొడవుగా వుండే ముక్కుకయితే—మధ్యభాగానికి క్రింద కొంచెం డార్క్ షేడ్ వచ్చేటట్లు చెయ్యండి. ముక్కు పెద్దదిగావుంటే ప్రక్కల షేడ్స్ డార్క్ చెయ్యాలి.

ప్ర: నా పళ్లు ఎత్తుగా దూరం దూరంగా వుంటాయి. నవ్వితే బాగుండదు గనక నా పళ్లని అసహ్యించుకుంటాను. తీగలు బిగించడం నాకు ఇష్టముండదు. తొందరగా జవాబివ్వండి.

జ: మీ డెంటిస్టు దగ్గరికి వెళ్లి చూడండి, ఖాళీలను పూర్తి చెయ్యడానికి అతడు కొన్ని 'కేప్స్' ఇవ్వొచ్చు

ప్ర: నా కళ్లచూపు తక్కువ. ఆడపిల్లల్లాగా అద్దాలు వేసుకోవడం ఇష్టముండదు. ఒకవేళ నేను వేసుకునే అద్దాలు నీలం, వూదా రంగుల్లోవుంటే అవి కళ్లకి అపకారం చేస్తాయా? టెలివిజన్ చూస్తున్నప్పుడుగాని, బ్లాక్ బోర్డు చూస్తున్నప్పుడు గాని ఈ అద్దాలవల్ల హాని కలుగుతుందా?



జ: రంగు తక్కువగావున్న అద్దాలవల్ల హానివుండదు. కాంటాక్ట్ లెన్స్ గురించి ఎప్పుడూ వినలేదా? అద్దాలు వుపయోగించడం ఇష్టం లేకపోతే వాటిని ట్రయ్ చెయ్యండి.

ప్ర: నాకు పదిహేనేళ్లు. నా సమస్య ఏమిటి అంటే — నా శరీరమంతటికంటే తుంటిభాగం పెద్దది. దాన్ని తగ్గించవచ్చా?

జ: ఎక్సర్‌సైజ్ చెయ్యండి. నేలమీద వెల్లకితలా పడుకోండి. చేతులు శరీరానికి అంటిపెట్టుకునేలా చాపండి. అటూ ఇటూ ఒకయాభైసార్లు రోజూ దొర్లుతూ వుండండి. రోజు రోజుకీ అయిదుసార్లు చొప్పున హెచ్చిస్తూవుంటే కొద్దిరోజుల్లోనే మీకు గుణం కనిపిస్తుంది.

ప్ర: నేను పదిహేనేళ్ల కుర్రాడ్ని నా ఛాతీ ఆడవాళ్ల ఛాతీలా వుంటుంది. పెద్ద ఎక్సర్‌సైజు లేకుండా ఈ సమస్య తీరే విధం వుందా?

జ: పెద్ద ఎక్సర్‌సైజులేకుండా ఈ పెద్దసమస్య తీరాలా? మీ బద్ధకమే ఇలా తయారవ్వడానికి కారణం మరీ విపరీతంగా వుంటే ప్లాస్టిక్ సర్జన్‌గారి దగ్గరికి వరుగెత్తడం మంచిది. ఇదే మీకు సులువైన మార్గం. ●

స్త్రీనన్నా మగవాడిచ్చిన్న తిలసభావం— వా మాటకు ఎదురు లేదనేసర్వం వెల్లడవుతూంది. అలా నిర్దాక్షిణ్యంగా—ఆడవుల పాలు చేసి—అశ్వమేధ యాగానంతరం—లవకుశుల్నిచూపి, పుత్రకాంక్షతో మరలా సీతను చేబట్టబూనటం మగవాడిలో అంతర్లీనంగా వున్నదారుణమైన స్వార్థానికి మచ్చుతునక.

మగవాడికి కావాల్సినది కీర్తికాంక్ష— స్వసుఖం — సంతానాభివృద్ధి — అందుకు ఆలంబనమాత్రమే స్త్రీ — అంతకన్నా మగవారి హృదయంలో ఆమెకు స్థానం లేదు - గౌరవం అసలేలేదు: అందువల్లనే—

సీతాదేవి అంతటి మహాపతివ్రతకూడా, శ్రీరాముడి స్వార్థాన్ని—అహాన్ని సహించలేక— అవమాన భరితమైన మహాదుఃఖంతో రసాతలానికి వెళ్ళిపోయింది. ఆనాటినుండి— ఈనాటివరకు—పురుషుడిచేతిలోవంచితురాలై బాధాకరమైన జీవితాన్నే గడుపుతోంది స్త్రీ—ఓ స్త్రీ నువ్వంతటి నికృష్ణ రాలివి? ఇంత హేయమైన జన్మ నీకెవరిచ్చారు. నిన్నిలా బ్రతకమని శాసించే అధికారం ఎవరికున్నది? ఇంత జడప్రాయంగా బ్రతకటమెందుకు? ఎవరికోసం? అంతులేని ప్రశ్నలు మనస్సుని తొల్చికల్లోలం చేస్తూ—జలపాతపు హోరు గుండెల్ని వ్రయ్యలు చేస్తుంటే — ఆగని కన్నీరు చెక్కిళ్ళు తడిపివేయగా, ఇక వినలేక లేచి మేడమీదకు వెళ్ళింది శిరి.

మెదడంతా కుళ్ళబొడిచినట్టు-బాధగా— బరువుగా వున్నది.

గుండెల్లో పిచ్చి ఆరాటం — ఏమీతోచని స్థితిలో కాస్సేపు అటు ఇటు తిరిగివచ్చి రేడియోదగ్గిర కూర్చుని ఆన్ చేసింది. ఏదో స్టేషనునుండి నాటకమేదో ప్రసారమవుతూంది.



'మగవాలిని, ఏకాకులను పాలుపు శేలనే తయ్యారి?

'మగవాలిని కనక నేనే! వెలయాలినే అయితే — కన్ను గీటేవరికి సార్వభౌము డయినా వచ్చి వడిలో వాలడటే చెలీ... చెలీ ఈ బాధను పైపలేనే చెలీ-నా స్వామికి తన్ను గూర్చి పుణ్యం కట్టుకోవే' టక్కున స్టేషన్ మార్చింది శిరి.

'నన్ను విడనాడి దయమాలిపోయితివి
గావి నీవు సుఖపడము పోన్
ఇన్ని కన్నీళ్ళ కౌగిళ్ల ముళ్ళ
మరచి చేరుకొను మావలిగట్టు
నీవు లేవంతమాత్రాన గుండె పగిలి
ఒక్కసారిగ మరణించపోదు
నిన్ను తలపోసుకొనుచు క్షణక్షణ
మరణమ్ము పొందెదను నేను'
(తరుణ)

మరో స్టేషనునుండి మరో బాధా పూరిత మైన స్త్రీ కంఠం.

వింటున్న శిరి కన్నుల్లో చివ్వున కన్నీరు తిరిగింది. వినలేక రేడియో ఆఫ్ చేసింది. ఎక్కడా చూసినా మగవారి వంచన — ఆడ వారి హృదయ ఘోష...భగవాన్ — ఏమిటీ బాధ? ఎందుకీ బ్రతుకు. క్షణక్షణము మరణిస్తూ—ఇలా వికృతంగా బ్రతక్క పోతేనేం? లేచివెళ్ళి మంచంమీద పడ్డది. కాని వేదనాపూరితమైన ఆలోచనలు ఆమెను విడలేదు.

# చరితార్థులు

మగవారంటే, ఏదో కసి—తనస్తితివట్ల జాలి—సమాజవ్యవస్థ అంటే అసహ్యం ఆమెను వెర్రెత్తిస్తున్నాయి. స్త్రీ జాతి ఒక్కసారి నశించిపోయి పురుషులు—తల్లి—భార్య — సోదరిలేకుండా అలమటించి — ఆక్రోశించిపోవాలి—అప్పుడుగాని స్త్రీవిలువ పురుషుడికి తెలిసిరాదు, అన్న పిచ్చికోరిక—ప్రతీకారేచ్ఛ. ఆమెలో అణువణువునా కల్లోలితం చేస్తుంటే దారితప్పిన మనస్సు—అవివేకపు నిర్ణయానికి పురికొల్పింది.

తెల్లవారిన తరువాత ఏడు గంటలకు—మేడమీద గదులు తుడవటానికి వచ్చిన పనిపిల్ల రాజి, శిరి గదితలుపులు ఇంకా వేసేవుండటంతో 'శయ్యాళ అమ్మాయిగారు ఇంకా లేవలేదే' అనుకుంటూ — చేర వేసివున్న తలుపునెట్టి లోపలకు అడుగు పెట్టినదల్లా—శిరి పరున్న వాలకం చూసి చెదిరిపోయింది. ఒకకాలు చేయి మంచంమీదనుండి వేలాడుతున్నాయి. జుట్టంతా చెదిరి వీపున పరుచుకున్నది. దగ్గిరకు రావటానికి రాజీకి భయంవేసి నాలుగంగల్లో క్రిందికి పరుగెత్తి

'అమ్మగారూ—శిరమ్మగారు ఎట్లానో వున్నారు. మీరు బేగి రాండమ్మా' ఖంగారుగా చెప్పింది. ఇందిర చేతిలోపని వదిలి మేడ మీదకు పరిగెత్తింది. శిరి పడుకున్న వాలకం చూస్తే ఆమెకూ భయం వేసింది. దగ్గిర కొచ్చి

'అమ్మ-శిరి ఇలా పడుకున్నావేమ్మా' తట్టిలేపింది. శిరి కదలలేదు. చెయి ఎత్తితే అటు వేలాడిపోతూంది. ఇందిర గుండె గుభిల్లుమన్నది.

'ఏమండీ! కొంపమునిగింది! తొందరగా రండీ! ఒసే రాజీ అయ్యగార్ని పిలవ్వే' ఇందిర దాదాపు ఏడుపు గొంతుతో పిచ్చిగా కేకపెట్టింది. తెల్లవారుజాము అయిదు గంటలకు క్యాంపునుండి వచ్చిన రమణ అప్పుడే కాస్త నిమ్మళించుకున్నాడు. ఇందిర కేకలకు వులిక్కిపడిలేచి జారిపోతున్న లుంగీ పైకిలాగి కట్టుకుంటూ—మేడమీదకు పరిగెట్టేడు.

'ఏమిటి? ఏమైంది' శిరి దగ్గిరకొస్తూ అన్నాడు, ఇందిరకు నోటమాట పెగిలి రావటం లేదు.

'ఏమో! రాత్రి మామూలుగానే భోజనం చేసి పైకి వచ్చింది. ఇప్పుడు చూస్తే యిలా వున్నది.'

శిరిని కదిపి చూశాడు. చలనంలేదు. వూపిరితీస్తున్న జాడైనాలేదు. క్షణం అతని బుర్ర పనిచేయలేదు. పిచ్చిగా చుట్టూ చూశాడు, టేబుల్ మూలగావున్న ఖాళీ సీసామీద అతని దృష్టిపడి వంగి తీశాడు. నిద్రమాత్రల సీసా అది. అందులో రెండు మాత్రలు మిగిలి వున్నాయి

'అయ్యో ఎంతపని చేశావు శిరి!' ఇందిర పైటచెంగు నోట్లో కుక్కుకున్నది.

రమణ కిందికి పరిగెత్తి ఫోన్ అందుకున్నాడు.

'ఏమిటి—ఏమిటి?' అవతలనుండి రామనాథంగారి గొంతు

రమణకు వణుకుపుట్టి మాటరావటం లేదు.

'మా శిరి ... నిద్రమాత్రలు ... మీరు త్వరగా రండి' అస్తవ్యస్తంగా అన్నాడు.

పావుగంటలో డాక్టరు రామనాథంగారి కారు వాకిట్లో ఆగింది.

శిరి చేయందుకుని నాడి చూస్తున్న రామనాథంగారి కనుబొమలు ముడిపడ్డాయి. కళ్ళుమూసుకొని ఆలోచిస్తూ చేయివదిలి — హార్టు చూశారు. ఎక్కడో స్లోగా కొట్టుకుంటూ — స్టెత్‌కు అందినట్లు వున్నది.



ఆయన మోముల్లో ఆశారేఖలు విచ్చుకున్నాయి.

'ఫరవాలేదు — ఏ తెల్లవారు జామునో మాత్రలు మింగినట్లున్నది. త్వరగా ఆస్పత్రికి తీసుకెళ్ళటం మంచిది. పదండి' అని వారికి ధైర్యం చెప్పి — వారి కార్లోనే హాస్పిటల్‌కి చేర్చారు వెంటనే...

డాక్టర్ల గుసగుసలు — నర్సుల పరుగులు — ఆక్సిజన్ సిలెండర్లు. ఏవో మందులవాసన ... ఎవరెవరో తెల్లకోట్లవాళ్లు గదిలోకి వెళ్తున్నారు వస్తున్నారు

అంతా కలలోలాగా వున్నది రమణక్క. సగం స్పృహలేనట్లుగా వరండాలో బల్లమీద కూలబడ్డాడు. ఇందిరపనీ అలానే వున్నది. తను పెళ్ళయి కొత్తగా అత్తవారింటికి వచ్చేసరికి, శిరీష్ పదినెలలపిల్ల— బొద్దుగా ముద్దుగావున్న ఆ పాపని నిముషం వదిలేది కాదు తను. లాలపోసి — బువ్వపెట్టి — జోలలాడి— దాదాపు తన చేతులమీదుగనే శిరిని పెంచింది. అందుకే శిరిపట్ల తనకు ప్రత్యేకమైన అభిమానం. అది మిగతా ఆడబిడ్డలకు— తోటికోడళ్ళకు కూడా ఈర్ష్యగా వుండేది. అయినా తను పట్టించుకునేది కాదు. పుట్టింటినుండి వెళ్ళినప్పుడల్లా శిరికి ఏవో కానుకలు కొని తీసుకెళ్ళేది ఆ చిన్నారిపాప కన్నుల్లో మెరిసే సంతోషం చూస్తే తనకెంతో తృప్తిగా వుండేది.

అమ్మా— నాన్నలేని ఆ అమ్మాయిపట్ల ఇప్పుడు అభిమానం వేయింతలు పెరిగింది. ఇప్పుడూ తాము, వదినా — ఆడబిడ్డలల్లో మాటిమాటలనుకోటం దెప్పుకోటం విరుగరు. ఆప్తస్నేహితులల్లేనో — అక్కా — చెల్లెళ్ళవలెనో వుండేవారు. తన శచికన్నా మిన్నగా చూచేది శిరిని. ఏరగనివా 'శ్రీ పెద్ద అమ్మాయా!' అని శిరిని గురించి అడిగేవారు.

రాజాతో కూడని అతిపరిచయం పెంచుకున్నదని తెలిసినప్పుడు కూడా శిరిని కఠినం మాటలని నొప్పించలేదు. మెల్లగా స్నేహితురాలువలె మనస్సు నొచ్చుకోకుండా నచ్చచెప్పచూసింది అయినా శిరి ఇంత పని చేస్తుందనుకోలేదు. ఇటీవల ఆమె మానసికంగా బాధ పెండుతోన్నట్లు తను కనిపెట్టింది. రాజా—ఆమె పోట్లాడుకున్నారేమో- అదీ ఒకందుకు మంచిదే — కులం

# చరితార్థులు

గోత్రం గనివాణ్ణి కట్టుకుంటూ నరకంలా క్రమంగా మర్చిపోతుందిలే, అనుకున్నది గాని-ఇలా కొంపమునిగే పని జరుగుతుందనుకుంటే, ఆమె మనస్సునవున్న బాధ ఏమిటో తెల్సుకుని కొంతయినా వోదార్పు కలిగించేది. భగవంతుడా మా శిరిని కాపాడు తండ్రీ! అని మదిలోనే కోరుకుంటూ—కన్నీటిని తుడుచుకోటంకూడా మరిచి అలా కూచుండిపోయింది ఇందిర.

అయిదు రోజులు మృత్యువుతో హోరాహోరిగా పోరాడి చివరకు విజయగర్వంతో వూపిరి పీల్చుకున్నారు డాక్టర్లు.

ఆరు రోజుల తరువాత మెల్లిగా కళ్లు విప్పి చూసింది శిరి.

'అమ్మా శిరీ' దుఃఖము—సంతోషము పెనవేసుకోగా—ఆర్ద్రంగా చెల్లెలు వెన్ను రాస్తూ దగ్గిర కూర్చున్నాడు రమణ

వాడిన మోముతో దిగులుగా శిరివేపు చూడసాగింది ఇందిర. ఆ చూపుల్లో భావం మాటలకు అందనిది—ఎందుకిలా చేశావు? అన్నబాధ – ఇంకెప్పుడు ఇలా మమ్మల్ని ఏడిపించకు అన్న బతిమలాట...విన్నో... విన్నో...దిగులుపడిన మొహంతో జనవేపు ఆతంగా చూస్తున్న—అన్న-వదినల్ని వింతగా పరికిస్తూ—తనచుట్టూ చూపులు తిప్పి –

'నే నెక్కడ వున్నాను! నాకేమయింది? ఎందుకు వీళ్ళింత దుఃఖపడుతున్నారు?' తనలో తను గొణుక్కుంటూ కళ్లు మూసుకున్న శిరికి, మెల్లి మెల్లిగా గుర్తుకు రాసాగింది. తనపనికి తనకె సిగ్గు — బాధ వితితమైంది.

'వదినా నాకు చచ్చిపోవాలనున్నది—నన్నెందుకు బ్రతికించావు?' ఇందిరను వాటేసుకుని ఏడువసాగింది.

'ఛీ ..పిచ్చిపిల్లా అలా ఏడవవచ్చా, ఇది హాస్పటల్ – ఇలా గొడవచేస్తే వూరుకోరు. నీకు పూర్తిగా రెస్టుకావాలి, వెర్రి-మొర్రి వూహలతో మనస్సు పాడుచేసుకోవద్దు. చచ్చిపోవాలని నీ ఇష్టం వొచ్చినపని నీవుచేశావు—మరి నిన్ను బ్రతికించుకోవాలని మాకుండే శాయశక్తులా శ్రమించి బతికించుకున్నాము, భగవంతుడు మాపక్షంవున్నాడు. నీవు జీవించగలిగేవు—ఇంకా ఆ ప్రసక్తివద్దు–జరిగింది మరిచి—ప్రశాంతంగావుండు, చూడు—మీ అన్నయ్య ఎలా అయిపోయారో—వారంనుండి నిద్రా – నీళ్లు లేవు ఆయనకు—మీ అన్నగారి కోసమన్నా నీ ఆరోగ్యాన్ని చక్కబర్చుకోవా అమ్మా' ఆప్యాయంగా శిరి చెక్కిళ్ళు తుడుస్తూ అన్నది ఇందిర.

*    *    *

హాస్పిటల్‌నుండి ఇంటికి వచ్చిన శిరి ఆరోగ్యం కొంత చక్కపడినా మానసికంగా కోలుకోలేదు. అన్నా — వదినలవంక చూడటానికే సిగ్గుపడుతూ, గదినుండి ఇవతలకు వచ్చేదికాదు. వీలైనప్పుడల్లా ఇందిరే శిరి దగ్గిర కూర్చుని – కబుర్లుచెప్తూ – ఆమె దిగులు పోగొట్టాలని ప్రయత్నించేది.

శిరి ఎందుకంత అఘాయిత్యపు పని చేసిందో ఇందిరకు ఇప్పటికీ తెలీదు ఒక నాడు శిరి కాస్త మంచిమూడ్‌లో వుండగా చూసి ఆ ప్రస్తావన తెచ్చింది.

'ఏమమ్మా శిరీ, నీ శ్రేయస్సుకోరే ఆప్తులంకాదా మేము'

'అదేమిటి అలా అంటావు? నే నెప్పుడన్నా అలా అన్నానా? నా ప్రవర్తన నీ కలా అనిపించిందా వదినా' ఖంగారుగా అన్నది శిరి.

'మరి అలాటి పనెందుకు చేశావు? నీ సుఖమేకదా మాకు కావాల్సినది. నీమాట కాదంటామని ఎందుకనుకున్నావు. రాజుని మనింటికి తీసుకురమ్మని చెప్తే తీసుకురాడూ. ఏంజరిగిందో నాకు తెలీదు—చివరికి అంత దారుణమైన పనిచేశావు. మా మనస్సులు ఎంత బాధపడ్డాయో — కొంచమైనా యోచించావుకాదు. నీకేంలోటు చేశాము—నీ మాట ఏది కాదన్నాము. ఈ చేతుల్లో నిన్ను పెంచాను — ఈ చేతులతో నిన్ను పెళ్లికూతుర్నిచేసి అత్తవారింటికి పంపాలని ఆరాటపడుతున్నాము శిరీ—నువ్విలా చేస్తే నా మనస్సు ఎంత తల్లడిల్లిపోయిందో అర్థం చేసుకోగలవా?' ఇందిర కళ్లు నీటి చెలమలైనాయి

శిరి చప్పున ఇందిర చేయిపట్టుకుని

'వదినా అలా ఎప్పుడూ అనకు—మీరు లోటుచేశారనీకాదు—నామాట కాదంటారనీ కాదు, ఏం చెప్పను వదినా! అంతా నా ఖర్మ' చేతుల్లో మొహం కప్పుకున్నది.

ఇందిర కేమి అర్థం కాలే .

'ఏమిటి శిరీ ఏమైంది? ఏమీ చెప్పకుండా ఇలా ఏడిపిస్తే నాకెలా తెలుస్తుంది చెప్పమ్మా—నీ వదిన్ని కాదూ! నా మీద ఒట్టు చెప్పకపోతే' మొహాన చేతులు పత్తిడించి బ్రతిమాలసాగింది.

ఆమెవంక చూసే ధైర్యంలేక—తలవంచు

కునే—'వదినా...రాజు—రాజు వెళ్ళి పోయాడు' ఆపుకున్నా ఆగని కన్నీరు చెక్కిళ్ళమీద ధారగా కారసాగింది. ఇందిర తెల్లబోయింది.

'రాజు ఎక్కడి కెళ్ళేడు — నీకు చెప్ప లేదా? మళ్ళీ ఎప్పుడొస్తాడు' ఆ తురతగా అడిగింది.

'ఇంకరాడు వదినా — లక్షరూపాయల కట్నంఇచ్చి—ఫారెన్‌పంపే మామదొరికేడుట, అంత ధనరాసిముందు మా ప్రేమ సుడి గాలిలో పుల్లిపిరి కాగితంలాగా ఎగిరిపోయింది. రాజు నా మనస్సు—మమత, కాలదన్ని దగా చేసి వెళ్ళిపోయాడు వదినా' ఇందిర వొడిలో వాలిపోయింది.

'చివరికి అనుకున్నంత పనీ చేశాడన్న మాట—ఇంకా అతను మన కులం కాదేమో. మేము ఒప్పుకోమని అలా చేసా వనుకున్నాను. అందుకే మగవారి మాటలు నీటిమీద వ్రాతలంటారు. ఛీ ... వుత్త పిరికిదానివిలాగా ఏంపని చేశావు శిరీ! నాకా సంగతి అప్పుడే చెప్పవల్సింది'

'ఎలా చెప్పమన్నావు వదినా? నీవు హెచ్చరిక చేసినప్పుడన్నా నే మాటవింటే బావుండేది. నాలాటి అదృష్టహీనులకు చావు తప్ప మరోమార్గం ఏమి వున్నది. అమ్మా— నాన్న లేరు. ప్రేమించినవాడు దగా చేశాడు — ఇంక ఏం చూచుకని బ్రతకాలి వదినా?'

'ఎంత పిచ్చిగా వూహిస్తున్నావు శిరీ! జీవితం భగవంతుడిచ్చిన వరం వెయ్యేళ్ళపంటగా — పూలు. పిందెలు తొడిగి వర్ధిల్ల వల్సిన జీవితాన్ని— బలవన్మరణంతో నలిపెయ్య చేసుకోటం మహాపాపం — అవి వేకం, ఎటువంటి స్థితిలోనూ, ఇంత దిగ జారిపోకూడదు.'

'ఎనీ...వదినా — మగవాడి దురన్యా యానికి బలై—క్షణక్షణమూ మరణమూ బ్రతకటంకన్నా — ఒక్కసారి చచ్చిపోవటం హాయి గదూ? అయినా మగవాడి దురన్యా యాన్ని అరికట్టలేరుగానీ, పసిడికలలు భగ్నమైపోయి ఏటూ దారి లేక చావే శరణ్యం అనుకున్న ఆడదాన్ని ఆత్మహత్య నుండి కాపాడి, నికృష్టము — దీనము అయిన బ్రతుకు నె బ్రతకమంటారు ఎందుకు వదినా, అలా జీవించటం ఎంత దుర్భరమో అనుభవించేవారికే తెలుస్తుంది? అసలు మగవాడింత విశృంఖలంగా ప్రవ ర్తించటానికి సమాజమే కారణం! మగ వాడు ఎంత క్రౌర్యంగా ఆడదాన్ని హింసిం చినా— వారి అడుగులకు మడుగులొత్తి— కాళ్ళుకడిగి నెత్తిన జల్లుకుని, వారి ఆజ్ఞ లకు తలొంచి — వ్యక్తిత్వాన్ని కోల్పోయి బ్రతకటమే ఆడదాని ధర్మమని — అదే పాతివ్రత్యమని బోధించి— ఆడదాని బ్రతు కునే నిర్వీర్యం చేశారు. ఆ అలుసు చూసు కునే మగవాడిలో ఇంత అహం పెరిగింది. ఆ అహానికి ఎంతమంది స్త్రీల జీవితాలు బలైపోతున్నాయో ఎవరైనా ఆలోచిస్తు న్నారా? అనాడు—

పురాణాల్లో శ్రీరాముడు, తన రాజ ధర్మం కొరకు- కీర్తికొరకు నిండు చూలా లిని నట్టడివిలోకి పంపించాడు భర్త ఆజ్ఞను పాలించటమే పతివ్రతా ధర్మమని సీతా దేవి— భర్త ఆజ్ఞకు ఎదురాడకుండా — కంటికి, మంటికి ఏకధారగా కన్నీరు కారుస్తూనే— దయనీయమైన జీవితాన్ని గడి పింది. ఆ సీతా— సుమతివగైరాలే మనకు ఆదర్శం—అవంచకుడైన రాముడు, బుద్ధుడే ఈనాటి మగవాళ్ళ కాదర్శం — వంచనా శిల్పంతో కూడిన ఆ నాటి గ్రంథాలే పవిత్ర గ్రంథాలుగా నెత్తినెట్టుకుంటున్నాం. ఆనాటి మగవాళ్లు తమకు అనుకూలమైన విధంగా ధర్మాలు నిర్మించి వాటి ఆచరణలో స్త్రీలను బలిచేస్తే — ఈనాటి ఆధునిక యువకులు-డబ్బుకు — సుఖలాలసత్వానికి అమ్ముడుపోతూ స్త్రీకి గడ్డిపోచ విలు వయినా ఇవ్వకుండా, అంది సంతోషాలను అనుభవించి నడివీధిపాలు చేస్తున్నారు. ఇలాటి అసహ్యము — పరాధీనపు బ్రతుకు బ్రతకటానికి నిజంగా మనం సిగ్గుపడాలి. ఆత్మాభిమానం గల ఆడది ఈపరిస్థితుల్ని ఎదుర్కోలేనప్పుడు చావు తప్ప మరో మార్గంలేదు బానిస బ్రతుకుకన్నా అదే వేయిరెట్లు మెరుగు' ఆవేశంగా అన్నది శిరి.

'నిజమేనమ్మా! నీ అభిప్రాయాలతో నేనూ ఏకీభవిస్తాను. కానీ కొన్ని విష యాలు అర్థంచేసుకోటంలో నీవు పొర బడుతున్నావు. ఇందులో పురాణాల ప్రసక్తి కూడా తెచ్చావు.

శ్రీరాముడు సీతను వదిలిపెట్టటంలో ఓ గొప్ప రాజనీతిజ్ఞత వున్నది. దేశ పరి పాలకుడైన రాజుయొక్క నైతిక ప్రవర్తనే ప్రజాబాహుళ్యానికి వరవడి — రాజు నీతి దప్పినవాడైనప్పుడు — ప్రజలూ అదే మార్గాన్ని అనుసరిస్తారు. తద్వారా పెచ్చు రిల్లిన అక్రమాల్ని — దురన్యాయాన్ని అరి కట్టేవారులేక సమాజం కలుషితమై పోతుంది — అందువల్లనే దేశ భద్రతకొరకు ప్రజాహితం కాంక్షించే రాజు—రాగద్వేషాలకు అతీతంగా పరిపాలన సాగించాలి. అప్పుడే ప్రజలు సుశిక్షితులై — రాజపాలన సుగ మంగా కొనసాగి— సుభిక్షమైన కాలం వెల కొని— శాంతి— సౌఖ్యాలతో దేశం వర్ధిల్లు తుంది. అంతటి గురుతరమైన బాధ్యతా



# చరితార్థులు

నిర్వహణలో వ్యక్తిగతంగా బాధలు — వేదన భరించక తప్పదు. తాము నమ్మిన కర్తవ్యతా నిర్వహణలో — ధర్మసంస్థాపన కొరకు— ప్రాణసమంగా ప్రేమించిన సీతనే కాదు— పదునాలుగు సంవత్సరాలు నిద్రాహారాలు లేకుండా తనని కంటికి రెప్పలాగా కాపాడి, సేవించిన అనుంగుతమ్ముడు లక్ష్మణుణ్ణి సహితం — భాతృప్రేమను పక్కకు త్రోసి దేశబహిష్కృతుణ్ణి కావించాడు రాముడు. శ్రీరాముని శీలం— ఆత్మనిగ్రహం బహు గొప్పవి — అంతటి మహాపురుషుణ్ణి నిందించటానికి మనమెంతటివాళ్ళం?

సీతాదేవికూడా — సామాన్య స్త్రీవలె కుడ్డిగా పాతివ్రత్యాన్నినమ్మి బాధలు భరించలేదు. రాజ్యపాలకుడైన భర్త బాధ్యతల్ని తామూ సగం పంచుకుని— నిరపరాధి అయినప్పటికీ— మోయలేని మహా అపవాదు సహించి—ప్రజలు ధర్మచ్యుతులు కాకుండా నీతివర్తనులు కాగలందులకు— మార్గదర్శి అయిన రాముడికి బాసటగా నిలచి కష్టాల్ని భరించింది. త్యాగానికి — సంయమనానికి సీతమ్మ తల్లినే చెప్పాలి. భూపుత్రిగదా! భూదేవికున్నంత ఓర్పు ఆమెకూ వున్నది. కానీ...అంతటి ఓర్పుగలతల్లి — చివరికి శ్రీరాముడు నరోసాక్షి శపథం కోరినప్పుడు నిండు పేరోలగంలో అంతటి అవమానాన్ని సహించలేక రసాతలానికి తరలిపోయింది. స్త్రీ ఓర్మికి కూడా హద్దువున్నదని నిరూపించింది సీతా సాధ్వీమణి.'

'అవును ఆ సీతమ్మతల్లే మనకు మార్గదర్శి. అందుకే ఆనాటినుండి స్త్రీల జీవితాలు సీతా శాపానికి తాక్కివేయబడుతున్నాయి' జేవురించిన మొహంతో అన్నది శిరి.

'ఉండు శిరీ నన్ను చెప్పనివ్వు. ప్రజాబాహుళ్యంలో ధర్మనిరతి, రుజువర్తన పెంపొర్చి—లోక కల్యాణం కొరకు — స్వసుఖాల్ని త్యాగంచేసి బతుకుల్నే పణంగా పొడ్డిన భవ్యమైన జీవితాలు వారివి—వారికీ మనకు అసలు పోలికే లేదు.

కాలధర్మానుగతంగా—సామాజికవ్యవస్థలో అనేకమైన మార్పులు—చేర్పులు వచ్చాయి. ఆనాటి రాజులు— రాజ్యవ్యవస్థ ఈనాడు లేదు— దేశకాల పరిస్థితుల్ని అనుసరించి— మనిషి ఆలోచనారీతి నీతుల్లో కూడా వైవిధ్యమున్నది. నాగరీకంగా మనిషి ఎంతో యెదిగేడు. ఇంకను ఎదుగుతున్నాడు. మనిషియొక్క మేధ పెరుగుదలకు అనుకూలంగా జీవనరీతిని మార్చుకోగలిగినప్పుడే మానవ ప్రగతి సాధ్యమవుతుంది. గతాన్నే మూఢంగానమ్మి వెనక్కు నడవమని ఎవరూ అనరు— అలాటప్పుడు గతగాధల్ని పవిత్రమైనవిగా నమ్మి ఎందుకు నెత్తిన పెట్టుకుంటున్నారు! అంటావేమో, కానీ పురాణేతిహాసాలు చదివి తెల్సుకోటంలో తప్పులేదు.

ధర్మ సంస్థాపనార్థం పరంధాముడు రాముడై మానుషజన్మనెత్తి మానవసహజమైన సుఖ-దుఃఖాలు అనుభవించి మానవ శ్రేయస్సుకొరకు ఎన్ని కష్టాలు భరించింది — యెన్ని అవతారాలు దాల్చినదీ జగన్నాటక సూత్రధారియైన భగవానుని లీలలు పవిత్ర భావంతో చదవటం ముక్తి మార్గమని ఎంచే భక్తవరేణ్యులు కొందరైతే...ఆనాటి సాంఘిక వ్యవస్థని— రాజధర్మాన్ని — ప్రజల జీవనరీతుల్ని తెలుసుకుందుకే చదివే చరిత్రకారులు మరికొందరు. ఎవరెలా చదివినప్పటికి - యుగయుగాలుగా జరిగిన సాంఘిక పరిణామ గతి తెల్సుకుందుకే తప్ప — ఆనాటి ఆచార వ్యవహారాలు శిరోధార్యంగా ఎంచి ఆచరించబూనటం పరిహాసమే అవుతుంది. అయినప్పటికి ఈనాటి మన జీవనగతికి అనుకూలమైన దేమైనా వుంటే తప్పక ఆచరించ వల్సిందే. లేకపోతే లేదు. ఎందుచేతనంటే—

ఒక కాలానికి అనువర్తనీయమైన ఆచారాలు మరో కాలానికి అనుసరణీయం కాజాలవు. ఉదాహరణగా స్త్రీల పాతివ్రత్యాన్నే తీసుకుందాం. ఒకనాడు ఆడది పొరపాటుగానైనా పరపురుషుణ్ణి కన్నెత్తి చూస్తే — పాతివ్రత్యం మంటగలిసి— ఆ స్త్రీ మైలపడిపోయినట్లు ఆ స్త్రీని నైతిక చ్యుతురాలుగా హింసించి — వెలి వేసిన రోజులుండేవి. కానీ ఈనాడు స్త్రీలు చదువుకుని— వుద్యోగాలు చేస్తూ— అన్ని రంగాలలోనూ ముందడుగు వేస్తూ — స్త్రీ—పురుషుడి కే విధంగానూ తీసిపోదని తన సామర్థ్యాన్ని నిరూపించుకుంటున్నది. జీవన రీతి ననుసరించి అనేక విధాలుగా స్త్రీలు—పురుషులో కలిసి పని చేయవలసిన పరిస్థితు లేర్పడ్డాయి. అలనాటి పాతివ్రత్యానికి నిర్వచనమే మారిపోయింది. మానసికంగా బలవంతురాలైన స్త్రీ — వేయి మంది మగవారి మధ్యకు వెళ్ళినా తప్పు లేదు. మానసికమైన నైతిక బలానికే ఈనాడు ప్రాముఖ్యత ఎక్కువ. స్త్రీ జీవితం అనేకవిధాలుగా మార్పు చెందింది. ఏనాడో బూజుపట్టిన మూఢ నమ్మకాన్ని త్రోసిరాజని— పరిణతి నొందిన భావ శబలత నందుకొని వున్నతురాలైంది. కానీ...దురదృష్టవశాత్తు — కాలానుగుణ్యమైన మార్పు పురుషులలో రాలేదు. ముఖ్యంగా స్త్రీలపట్ల వారిదృష్టి మారలేదు. అనాదినుండీ పురుషుల్లో పేరుకున్న అహం ఈనాటికి అలాగే వున్నది, స్త్రీని భోగ్య వస్తువుగానే చూస్తున్నారు,



కాబట్టి ఈనాటి జీవన సరళిలో—స్త్రీలు ఎదుర్కొనే సమస్యలు — చిక్కులు మిక్కుటంగానే వున్నాయి. వాటి పరిష్కారమే మనం చూడాలి. స్త్రీపురుషులు కలిసి తిరగటం వలన సహజంగా ఆకర్షితులయ్యే అవకాశాలు మిక్కుటంగా వున్నాయి. అది అనివార్యం కూడాను. బలహీన మనస్కులు 'ప్రేమ'న్న అర్థంలేని పదజాలాన్ని వల్లించి —తమని తామే వంచించుకుంటున్నారు. కానీ — నైతికవర్తనానికి స్త్రీ కట్టుబడి వున్నంతగా పురుషుడు వుండటం లేదు. అవకాశం లభిస్తే చాలు — స్త్రీని ఏదో విధంగా వంచన చేసి — అవమానించి — పురుషుడు తన ఆధిక్యతను నిరూపించుకుంటూనే వున్నాడు. స్త్రీ పురుషు లిరువురూ పరస్పరం అర్థం చేసుకుని — కష్టసుఖాలు పంచుకుంటూ — సహజీవనాన్ని నెరపటమే శ్రేయోదాయకం, సాంఘిక భద్రతకూడాను. కానీ — దురదృష్టమేమంటే—కొన్ని సందర్భాలలో పురుషుడు స్వార్థంతో వంచకుడై —స్త్రీ జీవితాన్ని భ్రష్టం చేసినప్పుడు— వాడి ద్రోహానికి పడి ఏడుస్తూ — జీవచ్ఛవమై బ్రతుకును వ్యర్థం చేసుకోవటం పిరికితనమే అవుతుంది. పదుగురిలో తిరగవల్సిన స్త్రీ—మనోబలవంతురాలు కావాలి. ఏనాడో సీతా—చంద్రమతి—సుమతి వాళ్లకు అన్యాయం జరిగింది అని వాపోతే ప్రయోజన మేమిటి?

ఈనాటి ఆధునిక యువతి — పురుషుడి దౌర్జన్యాన్ని — అన్యాయాన్ని ఎదుర్కొని త్రోసిరాజని అపరాజితయ్యై నిలవాలి. ఒకడెవడో అన్యాయం చేశాడని — నిండు జీవితాన్ని బుగ్గిపాలు చేసుకోటం — మగవాడి దురహంకారానికి లొంగిపోయి వాడి అహాన్ని మరింత పెంచినట్లే అవుతుంది.'

'అయితే నిగ్గుమాలిన బ్రతుకు బ్రతకమంటావా?' శిరి కస్సుమన్నది. ఇందిర పక్కున నవ్వి—

'నిగ్గుమాలిన బ్రతుకు కాదమ్మా! నీచుడైన మగవాడికి సిగ్గు వచ్చేట్లు బ్రతకాలి. శిరీ — జీవిత సమస్యలకు చావు పరిష్కారమార్గం కాదు— కాకూడదు. చచ్చి సాధించేది లేదు. బ్రతికి ధీమాగా తలెత్తుకోవటమే గొప్ప. మగవారు నవ్విస్తే నవ్వటం —ఏడిపిస్తే ఏడవటం కాదని — తన దైనందిన జీవితం తనకున్నదని నిరూపించాలి స్త్రీ. అప్పుడుగాని మగవాడిలో అహం దిగజారదు. అకారణంగానో — సకారణంగానో




ఉదయం పడకమీది నుంచి లేచినప్పుడు అర చెయ్యి చూచుకొని, భగవన్నామ స్మరిస్తూ లేవడం అదినుంచీ వస్తూవున్న మన సాంప్రదాయం.

ఇలా ఎందుకు చెయ్యాలో నా చిన్నతనంలో నాకు బోధపడేది కాదు. కాని, కొన్నాళ్లు పోయాక తిరిగీ ఆ విషయాన్ని గురించి ఆలోచిస్తే ఒకటి తోచింది. లేవగానే మరొకర్ని చూసి, ఆ దినం జరిగే మంచి చెడ్డలకు వారి ముఖం చూడడమే కారణమని అనుకోనక్కర్లేకుండా తన హస్తాన్నే చూచుకుంటే—మరెవర్నీ అనుకోనక్కర్లేదు. నాటిదినం మంచి జరిగితే బాధ లేదు కాని, చెడ్డ ఏదయినా సంభవిస్తే తెలిసి కాకపోయినా మనస్సులోనయినా, తాము నిద్రలేవగానే చూచిన వ్యక్తులను నిందించడం స్వభావం!

లేవగానే ఎవర్నీ చూడకుండా ఏ దేవుని పటాన్నయినా చూడవచ్చును గదా! అని అంటారేమో! పడకగదిని పటాలతో అలంకరించే అర్హత ఎంతమందికి ఉంటుంది! అంతే కాదు. ప్రత్యేకంగా తనకు మాత్రం పడకగది ఉండే గృహాలు ఎందరి కుంటాయి?

అందువల్ల తన చేతిని తాను చూచుకుంటే మరి ఎవరినీ నిందించనక్కర్లేదు గదా! అందుకోసమే ఈ సంప్రదాయం ఏర్పడి ఉంటుందని ఊహ కలిగింది.

కాని—తర్వాత తర్వాత అసలు విషయం బోధపడింది—పెద్దలవల్ల ఈ శ్లోకం విన్నాక—

'కరాగ్రే వసతే లక్ష్మీః
కరమధ్యే సరస్వతీ
కరమూలే తు గోవిందః
ప్రభాతే కరదర్శనమ్.'

చేతియొక్క అగ్రభాగంలో లక్ష్మి ఉంటుంది. హస్తం మధ్యభాగంలో సరస్వతీ దేవి ఉంటుంది. కరం మూలభాగంలో విష్ణుదేవుడు ఉంటాడు. అందువల్ల ప్రాతఃకాలంలో—నిద్రనుంచి లేవగానే తన కరాన్ని తాను చూడడం ఉత్తమమైనదని అభిప్రాయం.

అందువల్ల కరమూలాన్ని చూచుకుంటే భగవంతుని దర్శనం చేసుకున్నట్లే అవుతుంది. ఇక నిత్యయాత్రకు చేసుకోవలసిన పనిపాటలు తెలివితేటలపైనే ఆధారపడి ఉంటాయి. అందువల్ల దానికి కారణమైన సరస్వతీదేవి దర్శనం కరమధ్య దర్శనంవల్ల లభిస్తుందన్నమాట. జీవికకు ఆధారం ధనం కాబట్టి, దానికి ఆధారమైన లక్ష్మీదేవి దర్శనం కూడా దినప్రారంభంలో అవసరమే! కరాగ్రాన్ని చూచుకోవడం మూలాన లక్ష్మీదేవి దర్శనం చేసినట్లవుతుంది.

నిద్ర లేవగానే ఒక్క తన హస్తాన్ని తాను చూచుకోవడంవల్లనే దేవత్రయ దర్శనం లభించడంవల్ల దీని ప్రాశస్త్యం వెల్లడి అవుతున్నది. ●

## చరితార్థులు

మగవారిచే పరిత్యక్తలై అలమటించే స్త్రీలు ఎందరో వున్నారు. అలాటివారి మనస్సున పేరుకున్న నైరాశ్యాన్ని తొలగించి—వెలుగు బాట చూపించటం ఆధునిక యువతి కర్తవ్యం — శిరీ నువ్వలాటి వారికి మార్గదర్శి కావాలి — రాజలాటి రాస్కెల్సుకు బుద్ధి చెప్పాలి. నీలో పేరుకొన్న నిరాశా నిస్పృహలు తొలగించి—వాటి స్థానే ధైర్యాన్ని—పట్టుదలనూ నిలుపుకో — నిజమైన ఆత్మశక్తితో — దృఢదీక్షతో నువ్వు ముందడుగు వేసిననాడు — వెయ్యిమంది రాజలైనా నీ కాలి గోటికి సరిపోలరు. శిరీ... నీ జీవితం మూడు పూవులు—ఆరు కాయలుగా వికసించాలని నా కోరిక. వివేకంతో ఆలోచించు—మనస్సున మాలిన్యపు టాలోచనలకు తావివ్వకు. భగవంతుడు నిన్ను ఆశీర్వదిస్తాడు' అలసిపోయినట్లు ఇందిర వూపిరి పీల్చుకుందుకు ఆగింది.

'చాలా రాత్రయింది. నిన్ను విసిగించానా? ఇంక చాలు పడుకో' అంటూ లేచి గుమ్మందాకా వెళ్లిన ఇందిర మళ్ళీ వెనక్కు వచ్చి — 'శిరీ నాదో మాట—మళ్ళీ ఎప్పుడూ అలాటి పిచ్చిపని చేయనని మాటిస్తావా?' చేయి చాపింది.

'మళ్ళీనా? ఒక్కసారి జరిగినదానికే అవమానంతో కృంగిపోతున్నాను. వదినా— నీవు నాకు గురువువై—తూలిపోయే నా జీవితాన్ని నిలబెట్టి మహోపదేశం చేశావు. చీకటి నిండిన నా బ్రతుకులో—నీ హిత వచనాలే వెలుగురేఖలై నాలో కాంతి నింపాయి. ఆ వెలుగు సహాయంతోనే జీవితంలో ముందుకు సాగిపోగలను.' నీళ్లు నిండిన కళ్లు గట్టిగా మూసుకుని — ఇందిర చేతిలో చేయి వేసి ఆ చేయి ఆప్యాయంగా కళ్లకద్దుకున్నది శిరి.

'మా శిరి మంచి అమ్మాయి — మంచి వాళ్లని భగవంతుడు సదా కాపాడుతాడు' అని శిరి వెన్ను తట్టి గదిలోంచి వెళ్ళింది ఇందిర.

(ఇంకా ఉంది)

# సంధి సమయం




మంగళవాయిద్యాల మధ్య పీటలమీద పెళ్ళికొడుకన్నుపి మాణిక్యమ్మకి గతం కళ్ళముందు మెదిలింది.

ఆనాడు రైలు దిగగానే మాణిక్యమ్మగారు తనకు కావలసిన మనుషులకోసం వెతుక్కోనవసరం లేకపోయింది. పాతికేళ్ళ వయసులో నూనూగు మీసకట్టుతో వున్న ఒక యువకుడు వచ్చి 'మాణిక్యమ్మగారు మీరేనా?' అని అడిగేడు. ఆవిడ వెనకాలే నిలబడి దిక్కులు చూస్తూ నిలబడి వున్నాడు ఆమె భర్త భూషణం. పోర్టరు దింపిపోయిన మూట్కేసూ, బెడ్డింగు ప్లాట్‌ఫారంమీద వున్నాయి.

'అవున్నాయనా' అంది మాణిక్యమ్మ, సంతోషపడిపోతూ.

'నన్ను వసంతమ్మగారు పంపేరండి మిమ్మల్ని ఇంటికి తీసుకెళ్ళటానికి వచ్చేను' అన్నాడతను.

'సంతోషం నాయనా' అంది మాణిక్యమ్మ.

'రండి', అంటూ ప్లాటుఫారంమీద పెట్టివున్న సామాన్లు అలాగ్గా అందుకుని ముందు నడిచేడు అతను. మాణిక్యమ్మకి వెంటనే తన కొడుకు జ్ఞాపకం వచ్చేడు. దాదాపు అదే వయసులో వున్న ఆమె కొడుకు కుమార్ కాలేజిలో బి.ఏ. చదువుతున్నాడు. కుమార్‌కి చింతో బద్ధకం. లేవటము రోజూ తొమ్మిదిగంటలకి. లేవగానే బెడ్‌కాఫీ కావాలి. అతనిగది అస్తవ్యస్తంగా వుంటుంది. తన సామాన్లు పుస్తకాలు అన్నీ ఇష్టం వచ్చినట్లు అతను విసిరేసి వుంచుతాడు. అతని గదిని రోజు కొకసారయినా ఆమె సర్దకపోతే అది ఆ మర్నాటికి దుర్గమారణ్యంగా వుంటుంది. మాణిక్యమ్మకి పొందిక విడగని ప్రీతి విశ్వాసం. కుమార్ యొక్క పొందిక లేనితనం ఆమెకి సదా అసంతృప్తి కలిగిస్తూ వుంటుంది. ఆ అసంతృప్తిని లోలోనే అణచి వుంచుకుని కుమార్‌ని మంచి మాటలతో దారికి తీసుకురావటానికి ఆమె ప్రయత్నిస్తూ వుంటుంది. 'ఈ కాలపు పిల్లలు ఇంతే. మరీ బద్ధకం మనుషులు' అనుకుంటూ వుంటుంది. భూషణంగారు ఇంటిసంగతులు అంతగా పట్టించుకోడు. తనేమో, తన ఆఫీసూ, పేకాట స్నేహితులు ఏమో అదే అతని లోకం. ఇంటి పెత్తనం అంతా ఆమెదే.

తను బెడ్డింగునీ, మూటుకేసునీ సులువుగా చేత్తో పట్టుకుని ముందు నడుస్తున్న ఆ యువకుణ్ని చూడగానే మాణిక్యమ్మలో ఈ ఆలోచనలు ముసిరి, అతని స్వభావం ఆమెని ముగ్ధురాల్ని చేసింది. తన కాలంలో మాణిక్యమ్మగారూ కాలేజి చదువుల వరకు చదివి మానేసింది. తను చదివిన పుస్తకాల్లో 'డిగ్నిటీ ఆఫ్ లేబర్' అన్న విషయం ఆమెని చింతో ఆకర్షించింది. తనకు లేని ఆ విశ్వతాభిప్రాయాన్ని భర్త సంగతి అట్లా వుంచి, కొడుకయినా ఏ కొంచమయినా అనులులో పెడ్తే ఆమె చింతో సంతోషించి వుండేది. అది లేని ఇంటి పరిస్థితి ఆమెకి అసంతృప్తి కలిగించింది.

తన కొడుకు కుమార్ పూర్తిగా తప్పుడంగా తయారయేడు. ఫలితం తన

వస్తు కూడా తాను చూసుకోలేని బలహీన మయిన దురవస్థకి అతను అలవాటు పడిపోయేడు. ముందు ముందు దేశాన్ని నాయకులయి నడిపించవలసిన యువకులలో ఇటువంటి స్వభావం మిక్కిలి గర్హనీయము. ఆమె అభిప్రాయం. కాని ఆమె మాత్రం ఏమి చేయగలదు? ఏకైక సంతానమయిన కుమార్‌మీద గల ఆమె పుత్రేషణ ఆమెనోరు కట్టుబడేలా చేసింది. బహుశా తమకుగల ఐశ్వర్యము, డబ్బుతో ఏదయినా సమకూర్చుకోగలమన్న ధీమా, భర్తయొక్క, కొడుకుయొక్క ఆ అలస త్వానికి కారణమయి వుండవచ్చునని ఆమె అనుమానపడుతుంది.

స్టేషను బయట నిద్రగన్నేరు చెట్టు కింద బండి వున్నది. సామాన్లు బండిలో పెట్టి బండిని సిద్ధం చేసాడు అతను. ఎడ్లకి మువ్వలు అలంకరించి వున్నాయి. కొమ్ములకి రంగువేసి వున్నది. లోపల గడ్డివేసి చాపలు పరిచి వున్నాయి. మాణిక్యమ్మ భూషణం ఎక్కాక బండి బయలు దేరింది. కళ్ళజోడు బయటికితీసి తుడుచు కుంటూ వచ్చిన పొలాల్ని, నిగిరే సకుల్ని గాలికి రెపరెప లాడుతున్న పొలాల్లోని వరి మొక్కల్ని చూస్తున్నాడు భూషణం. ఎడ్లని అదిలిస్తూ వుషారు చేస్తున్నాడు, ఆ యువకుడు. విశాలమయిన అతని వీపుని, కండలు తిరిగిన బలిష్ఠమయిన అతని చేతుల్ని చూస్తూ ఆలోచనల్లో పడింది మాణిక్యమ్మ.

కుమార్ సన్నగా రివటలా వుంటాడు. అతన్ది హీనమయిన ఆరోగ్యం. ఆడపిల్ల చేతులు. సుకుమారమయిన శరీర నిర్మాణం. అంతా తండ్రి పోలిక. యువకులు బలంగా ఆరోగ్యంగా. ధార్ఢ్యకంగా వుండటమే అంద మని అనుకుంటుందామె. బహుశా ఎండ కన్నెరుగక, నీడ పట్టునే సాగిన వారి జీవన విధానమే అందుకు కారణ మయి వుండవచ్చుననుకుంటుంది ఆమె. ఏమయినా మొదట్నుంచి ఆమె ఏర్పరచు కున్న అభిప్రాయాలకి, జీవితంలో ఆమెకి ఎదురయిన వాస్తవాలకి ఎడమొగం, పెడ మొగమే అయింది. రోజులు గడిచి యువ కులు ముదుసలులూ, పిల్లలు యువకులూ అయేరు.

ఇప్పుడున్న భర్త ఇంటి విషయాలు

# సంధి సమయం

అంతగా పట్టించుకోడు. కుమార్‌కి వయస్సు వచ్చింది. అతని పెళ్ళి చెయ్యాలి. ఆ బాధ్యత కూడా ఆమెకే వదలిపెట్టి చీమ యినా కుట్టనట్టు వుంటాడు భర్త. బాగా సంపాదించి తీసుకొని వచ్చి భార్యచేతిలో పెట్టటంతో తన బాధ్యత తీరినట్టు అను కుంటాడాయన. కుమార్ బుద్ధిమంతుడు చదువు వుంది. ఆస్తిపాస్తులున్నాయి. 'కో' అంటే కోటి సంబంధాలు వస్తాయి. అవి లేవని కాదు. పెళ్ళికూతురు అందమయిన దయి వుండాలి. చదువుకొని వుండాలి. మంచి సంప్రదాయమయిన కుటుంబం నుంచి రావాలి. వినయ విధేయతలు గలదయి వుండాలి. గొప్ప ఆస్తిపరుల ఇంటి మంచీ ఆ పిల్ల రావాలి. ఇదీ రాబోయే కోడలి గురించి మాణిక్యమ్మ వుద్దేశ్యం.

ఆ ఉద్దేశ్యం దృష్టిలో పెట్టుకుని ఇతర్లకి తెలీకుండా కోడలు కోసం అన్వే షణ సాగించింది ఆమె.

ఆ మధ్య ఒక స్నేహితురాలి ఇంట్లో శుభకార్యమయింది. అప్పుడు వసంతమ్మ, ఆమె కూతురూ వచ్చారు. ఆ అమ్మాయి పేరు విమల. విమల అందం, గుణం, మాణిక్యమ్మని ఆకర్షించాయి. బాగా చదువు కున్నదట కూడ. వసంతమ్మ, మాణిక్యమ్మ స్నేహితురాళ్ళు. కాలేజిలో ఇద్దరూ సహా ధ్యాయినులు. పరస్పరం ఎంతో అభి మానంగా వుండేవారు. ఆ తరవాత పెళ్ళి ళ్ళయి విడిపోయారు.

భూషణం లాయరుగా పేరు పొంది బాగా ఆర్జించాడు.

వసంతమ్మ భర్త భూస్వామి. చదువు కున్నవాడయినా వ్యవసాయాన్ని అభిమానించి సొంతవూళ్ళోనే స్థిరపడిపోయాడు. బాగా ఆస్తిపాస్తులున్న వాళ్ళేనని తెలిసింది. ఆయన ఏడాది క్రితం పోయాడని తెలిసి విచారిం చింది, మాణిక్యమ్మ. తన విచారాన్ని వసంతమ్మకి వ్యక్తం చేసింది. స్నేహితు రాళ్ళిద్దరూ ఆప్యాయంగా కబుర్లు చెప్పు కున్నారు. ఒకరి సంగతి ఒకరు తెలుసు కున్నారు, ఆ సందర్భంలోనే ఒక నిశ్చయా నికి వచ్చేసిన మాణిక్యమ్మ తన మనసు లోని మాటని సూచనప్రాయంగా తెలియ చేసింది. స్నేహాన్ని బంధుత్వం ద్వారా బల పరచుకోవాలన్న ఆకాంక్ష వెల్లడించింది, వసంతమ్మకి.

వసంతమ్మ ఆలోచనలో పడింది.

'ఏమిటి ఆలోచిస్తున్నావు? నీ అంత స్థుకి మేము తగమనా? మా కున్నదేదో వివరంగా చెప్పాముగదా! కుమారవాడు బుద్ధి మంతుడు చదువుంది. నా సంగతి నీకు తెలుసు. నీకూతుర్ని కడుపులో పెట్టు కుంటాను. సంశయం ఏమిటి?' అని రెట్టించింది మాణిక్యమ్మ.

'ఏం లేదు' అని తటపటాయించింది వసంతమ్మ.

'పిల్లా, పిల్లవాడూ ఒకర్నొకరు చూసు కుని ఇష్టపడాలని నీ అభిప్రాయం లాగుంది?'

'అది కాదనుకో'

'అమ్మాయిని నేను చూశాను. నాకు వచ్చింది. అబ్బాయికీ నచ్చినట్లే. నీ మా వాడి ఫోటో ఇస్తాను చూపించు అమ్మాయి ఇష్టపడితే ఇంక అడ్డేముంది?'

'అవుననుకో.'

'మరి ఇంక తాత్సారం దేనికి? ఒక మంచి రోజు చూసుకుని నీకు వుత్తరం రాసి మేము వస్తాము. ఏదో సాంప్రదాయ కంగానే అన్నీ మాట్లాడుకుని తాంబూ లాలు పుచ్చుకుందాము. ఎదిగి వచ్చిన ఆడ పిల్ల. వెంటనే పెళ్ళిచెయ్యకుండా గుండెల మీద కూర్చో పెట్టుకోవటం నీకు మాత్రం సుఖమేమిటి?' అంటూ హితవరిగా ఎంతో చెప్పి మొత్తానికి వసంతమ్మ చేత అవునని పించింది మాణిక్యమ్మ.

ఇంటికి వెళ్ళగానే శాస్త్ర్లని పిలిపించి ముహూర్తాలు సంగతి విచారించింది. దగ్గ ర్లోనే ముహూర్తాలూ వున్నాయని తెల్సింది. వెంటనే భూషణంతో సంప్రదించి తాము వస్తున్నట్టుగా ఉత్తరం రాసి పడేసింది, వసంతమ్మకి.

రోడ్డు వంకర్లు తిరుగుతూ పోతో వుంది. గిత్తలు చెంగు చెంగున ఎగురుతూ పోతూ వున్నాయి. వాటి మెడల్లో మువ్వలు మోగుతున్నాయి. మామిడి తోటల మధ్యన మెలికలు తిరుగుతూ పోతున్న బాట, యావత్తనం పాటమరించిన

అందమైన కన్నెపిల్ల మెడలోని వన్నెని బంగారుగొలుసులా వుంది. పిల్లగాలి ఒంటికి కితకితలు పెడ్తూ వుంది. దూరాన ఒకటి రెండు ఇళ్ళు కనపడి మరల చెట్లచాటున అదృశ్యమయాయి.

'ఊరు దగ్గర పడినట్లుంది?' అంది మాణిక్యమ్మ.

ఆ యువకుడు వెనక్కి తిరిగి నవ్వాడు. 'అవునండి. ఇంక పదినిముషాల్లో ఇల్లు చేర్తాము' అన్నాడు.

కనులు మూసుకని ప్రయాణపు బడలికని మర్చిపోవటానికి ప్రయత్నించింది మాణిక్యమ్మ.

పదినిముషాల్లో ఇంటిముందు బండి ఆగింది. చుట్టుప్రక్కల ఇళ్ళవాళ్ళు కుతూహలంతో చూసారు.

బండి దిగి కాళ్ళు కడుక్కుని లోపలికి వెళ్ళారు మాణిక్యమ్మ, ఆమె భర్త.

సామాను లోపలపెట్టి బండీని తీసుకుపోయాడు అతను.

భోజనాలయాక భాషణానికి ముందు వరండాలో పక్కవేశారు. మరునిముషం నిద్రలోకి జారిపోయాడు ఆ మానవుడు

కుర్చీలు వేసుకుని దొడ్లో వెన్నెట్లో కూర్చుని స్నేహితురాళ్ళు కబుర్లలో పడ్డారు.

'అమ్మాయి ఏది? కనపడదే?' అడిగింది మాణిక్యమ్మ.

'వస్తుంది. ఇవాళ తన స్నేహితురాలి పెళ్ళి. అందుకని వెళ్ళింది. ఈ పూళ్ళోనే.'

'ఇంతకీ తన పెళ్ళి తోసుకువస్తున్న సంగతి ఆ పిల్లకి తెలుసా?' మాణిక్యమ్మ నవ్వింది. వసంతమ్మా నవ్వింది.

'ఇంతకీ ఆ అబ్బాయి ఎవరు? మమ్మల్ని స్టేషన్నుంచి తీసుకువచ్చాడు. కుర్రాడు బుద్ధిమంతుల్లా వున్నాడు. వ్యవసాయం చేస్తున్నాడా?'

'అతనా? మావారి చెల్లెలి కొడుకు. బిం ఏ. పట్నంలో వుద్యోగం చేస్తున్నాడు, చంద్రమని. సెలవులకని ఇంటికి వచ్చాడు.'

'నేనట్లా అనుకోలేదు సుమా! పెళ్ళయిందా?'

'ఇంకా లేదు'

'సర్లే. ఆ వస్తి ఇప్పుడెందుకుగాని. అసలు విషయానికి వద్దాము. ఇంతకీ కూతురికి ఎంత కట్నం ఇచ్చి పంపిద్దామని నీ వుద్దేశ్యం?'

వసంతమ్మ నవ్వింది. 'నువ్వు అప్పుడూ ఇప్పుడూ అట్లాగే నవ్వుతావు. కాని ఇప్పుడు అట్లా నవ్వి తప్పించుకోలేవు. వారికి కోర్టు పన్లున్నాయట రేపుదనుమే అన్నీ స్థిరపర్చుకుని మేము రైలెక్కాలి' అంది మాణిక్యమ్మ.

తోసుకువచ్చిన ఈ కల్యాణం వసంతమ్మకీ సంతోషం కలిగించింది గాని ఆమె ఎందుకో సంశయిస్తూ వుంది.

'ఊఁ. కానీ. ఎంత ఇద్దామని?' రెక్కించింది మాణిక్యమ్మ

'ఇంకా ఈ రోజుల్లో కట్నాలు అవీ

ఎక్కడున్నాయి? ఆ పద్ధతులు పోయాయి గదా! ప్రభుత్వమూ యాక్టు చేసింది గదా!'

'అవుననుకో. ఎలాగయినా సంప్రదాయం అంటూ వుంది గదా.'

'అలా అయితే నీ కొడుకుని మా అమ్మాయికి ఇమ్మంటావా?'

'అదేం గాదు. ఆచారం వుంది గదా! ఆడ పిల్లకి కట్నం ఇవ్వటం అన్నది...'

'ఈ కట్నాలు వాటిమీద నాకు నమ్మకంలేదు. అమ్మాయిని చూసుకున్నావుగా. బుద్ధిమంతురాలు. మొదట్నుంచి కట్టుదిట్టంగా పెంచాను చదువు చెప్పించాను. పెద్దల ఎడల గౌరవం, అణకువ నేర్పాను. దాన్ని కోడలుగా చేసుకుంటే నువ్వు సుఖపడగలవని గట్టిగా చెప్పగలను.'

'అవుననుకో. అందుకే గదా నేను మోజు పడుతూంట?'

'మరింక ఈ కట్నాలు ఇవన్నీ ఎందుకు? అవన్నీ బూజుపట్టిన ఆచారాలు గదా?'

'ఏమయినా ఆచారం ఆచారమే గదా. మన పెద్దవాళ్ళు ఏర్పర్చారంటే మరిన్ని అవి ఇన్నాళ్ళుగా అమలు జరుగుతూ వస్తున్నాయంటే అందులో మంచి వున్నదని మనం ఒప్పుకోక తప్పదు గదా!' సిద్ధాంతీకరించింది మాణిక్యమ్మ.

'ఏముంది? అందులో మంచి? కొడుకుని కన్నవాళ్ళు, కూతుర్ని కన్నవాళ్ళని

# సంధి సమయం

పీల్చి పిప్పి చెయ్యటం, కూతుర్ని కన్నందుకు వాళ్ళేమో దుంప నాశనమయి పోవటం. ఇదేమి మంచి? కామంచి?'

'నువ్వు అలా మాట్లాడవద్దు. అన్నగారు వుంటే నీకు నచ్చచెప్పి వుండేవారని నా విశ్వాసం.'

వసంతమ్మ దీర్ఘంగా నిట్టూర్చింది. 'వారు లేరు. వారువుంటే నాకింత బాదరబందీ వుండేదిగాదు. ఆశలన్నీ అమ్మాయి మీదే పెట్టుకుని బ్రతికాను. ఆ శుభ కార్యమయితే నిశ్చింతగా మిగతా బ్రతుకు వెళ్ళమార్చుతాను. అదే నా ధ్యేయం.'

'మరి అటువంటప్పుడు నువ్వు ఇంత మొండిపట్టుదల ఎందుకు పడుతున్నావో నాకు అర్థంగాదు. కట్నంలేకుండా చేసుకుంటే రేపు నలుగురూ ఏమనుకుంటారు? నవ్వరూ?'

'నలుగురి సంగతి తీసెయ్యి. కొన్నాళ్ళు పోతే వాళ్ళకోళ్ళు మాటలు పోతయ్యి. మొదట్నుంచి స్నేహితులంగదా! నీ సంగతి చెప్పు. మనమధ్య ఈ కట్నాల ఆడంగోడలు ఎందుకు?'

'అవుననుకో. కాని పెద్దలు ఏర్పరచిన సంప్రదాయాన్ని కాదని నడవటం నాకు ఇష్టంలేదు. నీకు ఏమీ లేకపోతేగదా ఇదంతా. అన్నీ వున్నప్పుడు ఇవ్వగలిగిన స్తోమతు వున్నప్పుడు మాకోసం నాకీ పట్టింపులు ఎందుకు? చెప్పు' అంది.

వసంతమ్మ నిట్టూర్చి అంది 'నేను ఏమి ఇవ్వగలను? నా కూతుర్ని నీకు కట్నంగా ఇవ్వగలను అంతే.'

'అదేమిట?'

'అవును. వారు పోగానే దాయాదులు కోర్టుకెక్కి ఆస్తిపాస్తులు చాలవరకూ తన్నుకుపోయారు. ఇక నేను మిగిపోయాను' వసంతమ్మ కళ్ళు వత్తుకుంది.

మాణిక్యమ్మ బిత్తరపోయింది. అయోమయంగా చూసింది.

'అదేమిటి? నేను అట్లా అనుకోలేదే! పాపం! వూరుకో' ఓదార్చింది స్నేహితురాల్ని.

వసంతమ్మ బెక్కుతూ చెప్పింది. 'ఇక నా ఆశలన్నీ నీమీదే స్నేహితురాలిగా నువ్వు ఆదుకుంటావన్న నమ్మకం నాకుంది.'

'సర్లే. సర్లే. ఆలోచిద్దాము. బాగా పొద్దుపోయింది. ఇక పడుకుందామా? నాకూ బడలికంగా వుంది' అని సంభాషణని తుంచేసింది.

స్నేహితురాళ్ళు ఇద్దరూ పడకలు ఎక్కారు.

మాణిక్యమ్మకి నిద్రపట్టలేదు. 'ఎంత పొరపాటుగా అంచనా వేశాను, ఇంకా నయం. ముందే అన్నీ మాట్లాడకుండా పెళ్ళి జరిపించేసి వుండలేదు. భగవంతుడు మేలుచేశాడు. ఎంత స్నేహితం అయితే మాత్రం ఈ దరిద్రపుగొట్టు సంబంధం చేసుకోవాల్సిన ఖర్మ నాకేంటి?' అనుకుంటూ వుండిపోయింది దూరాన్నించి పెళ్ళిపందిరి వినిపిస్తోంది. విమల ఇంటికి వచ్చేదాకా వసంతమ్మా నిద్రపోలేదు.

'ఇంకా నయం. అంతస్తులూ ఐశ్వర్యాలూ అనుకుని విమలని నరకకూపంలో పడేయలేదు. విమల ఏట్లా అయినా తెలివిగలది, నా మూర్ఖత్వాన్ని తొలగించటానికి మంచి వుపాయమే చెప్పింది. అయినా పిల్లల మనసులు కలవాలిగాని మిగతా విషయాల్ని గురించి పెద్దలు మూర్ఖించకూడదు' అనుకుంది.

విమల వచ్చింది. వసంతమ్మ లేచి కూతురుదగ్గరకెళ్ళి కూర్చుని ఆప్యాయంగా ఒళ్ళు నిమిరింది

'వాళ్ళు వచ్చినట్టున్నారు గదా అమ్మా!' అంది విమల.

'ఆఁ'



## నిధుల కోసం వేట

'ఎక్అల్‌డిస్'

# సరస్సులో బంగారుపట్టణం

## 2

కొలంబియా ప్రాంతంలో ఒక సరస్సు వుంది. ఈ సరస్సు అడుగు లోతుగా వుంది. ఈ పూడిలో కోటాను కోట్ల విలువైన బంగారం, మణులూ వజ్రాలూ వున్నాయని వదంతి.

ఈ సరస్సు అసలు పేరు గాటవిటా. కాని, ఎల్‌డొరాడో అని అంతా పిలుస్తూ వుంటారు.

పదహారవ శతాబ్దంలో సైనికులు, సాహసికులు అనేకమంది ఇంగ్లాండునుంచి స్పెయిన్‌నుంచి జర్మనీనుంచి బయల్దేరి ఈ సరస్సువేటకు వెళ్ళారు. సరస్సు గురించిన కథలు వింత వింతలుగా అంతా చెప్పుకుంటూ వుంటారు. ఆశతో వెళ్ళినవారంతా నదులు దాటలేక, కీకారణ్యాలు దూరలేక, ఆకలితోను, క్రూరమృగాలతోనూ, విషజ్వరాలతోనూ మరణించారు. కాని వేటమాత్రం ఆగలేదు.

ఎల్‌డొరాడో కథ చాలా విచిత్రంగా వుంది. అది స్పానిష్ దండయాత్ర సమయంలో జరిగిందని వినికిడి.

గాటవిటా దగ్గర ఒకజాతి ప్రజలు నివసిస్తూ ఉండేవారు. ఆ జాతి పెద్ద మహా సంపన్నుడు. ఎల్‌డొరాడో అని అతన్ని పిలుస్తూ వుండేవాళ్ళు.

ఈ జాతి పెద్ద ప్రతి సంవత్సరం వంటినిండా బంగారపుపూత పూసుకునేవాడనీ, ఈ సరస్సులో స్నానంచేస్తూ వుండేవాడనీ — కథ. అతని అనుచరులంతా వాళ్ళ వాళ్ళ దగ్గరున్న నగలన్నీ ఈ సరస్సులోకి విసిరేస్తూ వుండేవారట!

ఈకథ మరోవిధంగా కూడా వినబడుతూ వుంటుంది: జాతి నాయకుని భార్య ఈ సరస్సులో మునిగిపోయింది. ఆమె ఆత్మ మాత్రం అక్కడే వుంది. ఒక దేవతగా అవతరించి పూజలందుకుంటూ వుంది. ఆమె ఆత్మశాంతికోసం ప్రతిసంవత్సరమూ పూజలు జరుగుతూ వుంటాయి. కొత్త నాయకుని ఎన్నుకున్నప్పుడూ మరింత ఘనంగా ఈ వేడుకలు జరుగుతాయి.

నగ్నంగా పూరేగి వెళ్తారు. వారి వంటి నిండా బంగారపుపూత వుంటుంది. కొంత మంది నిండా బంగారపు తొడుగులు. మణులూ వజ్రాలు ధరిస్తారు. నాయకుడు బంగారు రథంమీద పూరేగుతూ వెళ్తాడు. అతని వంటినిండా బంగారపు పూతతో 'బంగారుమనిషి'లా మెరిసిపోతూ వుంటాడు. అందుకే అతనికి ఎల్‌డొరాడో అని పేరు వచ్చింది.

నాయకుడు సరస్సులోకి దిగి స్నానంచేసి వంటిమీద బంగారాన్నంతా కడిగేసుకుంటాడు. మిక్కినవారంతా వారిదగ్గరున్న నగలూ డబ్బూ అంతా సరస్సులోకి విసిరేస్తారు. ఇదో పండగ.

స్పానిష్‌లో ఈ కథ చిలవలు పలవలుగా చెప్పుకుంటూ వుంటారు. జనానికి విపరీతమైన ఆకర్షించేది కూడా ఈకథే.

ఎల్‌డొరాడోని కనుగొనడానికి 20 జట్లు ప్రయత్నించాయి. 1541 లో ఒకసారి విఫలప్రయత్నం జరిగింది.

తర్వాత రెండు వందలమంది స్పానిష్ వారు 4000 ఇండియన్ బానిసలతో, ఆహారం, వేటకుక్కలు, యుద్ధసామగ్రితో ఈ స్థలాన్ని వెతకడానికి బయలుదేరారు.

బానిసల కంఠాలకు గొలుసులువేసి తీసుకెళ్తూ వుండేవారు. ఏ బానిస అయినా అలసిపోతే అతని కంఠం కత్తిరించి గొలుసులనుంచి విముక్తి కలిగించేవారు.

అదంతా రెడ్ ఇండియన్లమయం. వాళ్ళచేత నిజం చెప్పించడానికి సజీవంగా దహనం చెయ్యడంగాని, వేటకుక్కలకి వారిని ఆహారం చెయ్యడంగాని చేస్తూ వుండేవారు

ఇంత పటాటోపంగా బయలుదేరినా, వారికి ఆకలిబాధ, శత్రుభయం, క్రూర మృగాల భయమూ తప్పేవి కావు.

ఇంతమందిలోనూ ఒక అరవైమంది మాత్రమే మిగిలారు. అంతా అమెజాన్‌లో ప్రయాణించి దీక్ష విడవకుండా వెదికారు.

బంగారు పట్టణం ఒకచోట కాదని మరొకచోట, మరొకచోట కాదని మరొకచోట ఇలా వెదికి వెదికి వేసారి పోయారు.

అక్కడ భవనాలన్నీ బంగారంతోనూ వెండితోనూ నిర్మించారనీ, ప్రతివారికీ బంగారు పాత్రలని ఉపయోగిస్తూ వుండేవారనీ కథలు!

ఇలాంటి కథలు - విన్నవాడెవడైనా పిచ్చెత్తి పోతాడు.

1595 ఫిబ్రవరిలో రాలీ అనే ఆయన మళ్ళీ ప్రయత్నించాడు. అతనికి కొంత బంగారమైతే దొరికింది కాని, ఆశించినంతగా లేదు.

అతనికి చాలా నష్టం వాటిల్లింది. తన పరిశోధన వంతటినీ ఒక పుస్తకంగా రాశాడు. క్వీన్ ఎలిజబెత్‌ని సాయం అడిగాడు. ఆమె నిరాకరించింది.

ఎలిజబెత్ తర్వాత ఆమె వారసుడు ఒక స్పానిష్ అంబాసిడర్ సాయంతో ఈ నిధికి గాలం వేశాడు. అదీ విఫల ప్రయత్నమే అయింది.

అప్పటినుంచి ఇప్పటిదాకా ఈ వేట కొనసాగుతూనే వుంది.

సరస్సునయితే కనుగొన్నారుగాని అందులో నిధులు ఎవరికీ కనిపించలేదు. ఎక్కడబడితే అక్కడ గోతులుమాత్రం వున్నాయి.

కాని, లక్షల రూపాయలు ఈ వేటలో హతమైపోయాయి.

మట్టిలో బాగా లోతుగా ఈ నిధులు వున్నాయని ఇంజనీర్లు అంటున్నారు.

ఎప్పుడో ఒకప్పుడు కొత్త సాధనం వస్తుంది. దానితో ఈ నిధుల్ని బయటికి తియ్యొచ్చు.

(ఇంకా వుంది)




**వి. కె, సికింద్రాబాదు**

**మీరు రాస్తున్న 'మూడోమనిషి' పై అభిప్రాయం తెల్పుటకు మీ చిరునామా కావాలి.**

సీరియల్ పూర్తి అయ్యాక. ప్రతి భాగానికీ— 'అబ్బా! అద్భుతం' 'అయ్యో పాపం,' అంటూ — మీ రివ్వడం, నేను వినడం— హాస్యాస్పదంగా వుంటుంది. కొంచెం వోపిక పట్టండి.

**బి. ఎస్. వి, తుని**

**స్త్రీ జీవితానికి సంపూర్ణత్వం ఇచ్చేది ఏది ?**

వ్యక్తిత్వం చంపని వివాహబంధం.

**కె జి. ఆర్, కొలిపర్ల**

**భార్యాభర్త లిద్దరూ ఉద్యోగాలున్న వారు; వారిలో ఒకరు పదవీ త్యాగంచేస్తే కొంత నిరుద్యోగసమస్య తీరుతుంది కదండీ.**

చాలాకాలం నుంచీ పోషణ భారం వహించి అలసి పోయారు మగవాళ్లు. మేం యిప్పుడిప్పుడే ఆర్థికంగా— స్వంత కాళ్ల మీద నిలబడాలని ప్రయత్నిస్తున్న ఆడవాళ్లం— ఎవరు పదవీ త్యాగం చేయాలో మీరే చెప్పండి అయినా ఆడవాళ్ళు ఉద్యోగాలు మానేస్తే నిరుద్యోగ సమస్య తీరుతుందని ఎవరు చెప్పారు? అది మీ వూహ మాత్రమే లేక కోర్కె అయివుండాలి.

**ఎమ్. డి. ఎస్, హైద్రాబాదు**

**మాతృప్రేమకు నిర్వచనం ఏమిటి ?**

ముద్దొస్తే నెత్తిన పెట్టుకోవడం. కోపమొస్తే చితక్కొట్టడం.

**వి. ఆర్. ఆర్, సికింద్రాబాదు**

**పెద్దవాళ్ల మాటలే ఎందుకు వినాలి? అనుభవంమీద అన్నీ — తెలుసుకోవచ్చు కదా ?**

అనుభవం మంచి టీచరే. కాని ఖరీ దెక్కువ కదా?!

**ఆర్. జి. ఆర్, దుర్గాపూరు**

**నేను ఒక అమ్మాయిని ప్రేమించాను, అమ్మాయి నన్ను ప్రేమించింది' పెళ్లి చేసుకొందామంటే అమ్మాయి నాన్నకి యిష్టంలేదు.**

ప్రేమించడాని కక్కర లేని నాన్నగారి పర్మిషన్ పెళ్లి కెందుకు? ఆర్థికంగా ఎవరి మీదా ఆధారపడి లేకుండా వుంటే, అమ్మాయి మైనరుకాకుండా వుంటే— హాయిగా పెళ్లి చేసుకోండి.

**కె ఆర్; కె. ఎస్. కె, జె. కె. ఎమ్, కాజూరు**

**కలిసి వుంటే కష్టసుఖం. కాని ఈ రోజుల్లో అంతా వేరుగా వుండటానికి యిష్టపడతారు ఎందుచేత?**

కలసి వుంటే ఖరీదెక్కువ. ప్రయివసీ తక్కువ. అందుచేత.

**డి హెచ్, ఎమ్. ఆర్, ఖైరతాబాద్**

**సాధించేదేం వుండదు గాని — యీ రోజుల్లో నినాదాలకేం కొదవలేదు.**

నిజమే ఆదర్శాల కోసం గొంతు చించుకు దెబ్బలాడ్డం సులభం— వాటిని అనుసరించాలన్న తాపత్రయం కంటే!

**మీరు సర్వజ్ఞులా?**

కాదు బాబూ, ప్రతివాళ్ళూ అజ్ఞానులే— ఏదో ఒక విషయంలో.

**మనోజ్, హైద్రాబాదు**

**నీవంత ఆసమర్థురాలివి మన దేశంలో ఎవ్వరూ లేరు. మీ ఆడవాళ్లను నల్లిని కాలితో రాసినట్లు రాసి పారేస్తూంటే గాని దారిలోకి రారు. త్వరగా యీ వుద్యోగంలోంచి విరమించి మహాకవులు అయిన దివాకర్ల వెంకటావధాని వంటి మహాత్ములకు యీ పదవిని యివ్వగోరుతున్నాను. ఈ లేఖ ప్రచురించినా ప్రచురించక పోయినా బాధలేదు.**

ఎందుకు ప్రచురించను— నేను చదివి ఆనందించేది నా సాటి వారికి పంచాలి కదా! అయినా పాపం అవధాని మేష్టారినైనా మీ రడిగేవి యిలాంటి ప్రశ్నలే కదా!! . . . . మీ కాలి కింద నల్గిన ఆడ నల్లుల విషమే కాబోలు మీ ఒళ్లంతా పాకి సభ్యతని సంస్కారాన్ని మీలోంచి పారదోలింది! పాపం! యింకిలాంటి పాత పద్ధతి నల్లులని చంపడం మానేయండి. ఆరోగ్యం బాగు పడుతుంది. . . . . అయినా ఆడవారంటే ఎందుకంత కసి మీకు?, మీ తల్లి, మీ సోదరి, మీ భార్య వీరంతా ఆడవారు కాదా? వీరికీ— మీ ట్రీట్‌మెంటు— అంతేనా? మీలాంటి వాళ్లని చూస్తే నవ్వాలో— ఏడవాలో తెలియడం లేదు!

**టి.ఎన్.ఎస్.వి. ఆర్, ఆమదాలవలస**

**రామలక్ష్మిగారూ మీకు చక్కటి గాత్రం వుందని విన్నాను. ఒక్క పాట.**

ఎవరు ప్రచారం చేస్తున్నారు బాబూ—యీ వదంతులు!

**నాకో స్నేహితుడున్నాడు. వాడు ఎప్పుడు మాట్లాడను 'దేవుడు లేడు' అని అంటూంటాడు వాడినెలా నచ్చచెప్పడం ?**

అలాంటివారికి నచ్చచెప్పడం ఎందుకు—మన సమయం వృథా. దేవుడెక్కడ వున్నాడన్న ప్రశ్నకే తావులేదు భూమంతా నిండివుందతని యిల్లు. ప్రతిపాదా దైవాంశతో వెల్గుతూనే వుంటుంది. ఎటొచ్చీ—చూడదల్చుకున్నవాడే పాదరక్షలు వదలి ముందుకి సాగుసాతాడు. లేనివాడికి ఏమీ కనిపించదు.

**ఎమ్. ఎస్. కె, ఖుర్దారోడ్డు**

**మనిషిని మనిషిని కలిపేది ఏమిటి?**

వాక్కు. అది సవ్యంగా వుండాలి.

**ఎమ్ ఎమ్ ఆర్, సంగారెడ్డి**

**ఆడవారినెలా అర్థం చేసుకోవాలి?**

ఆడవారి విషయంలో—సుగుణాలను మెచ్చుకో. లోపాలను చూసీ చూడనట్లు వూరుకో— అనిపెద్దల సూచన!

**వై. హెచ్. ఎన్, కొత్తపాల్వంచ**

**తను మరణించే లోపున ఈ జీవితం నిరర్థకం అని అనుకోనివారు ఎవరైనా వున్నారా ?**

ఎవరూ అనుకోరు. అందుకే కదా—చివరి క్షణందాకా ఆశతో కొట్టుకోవడం.

**పి. ఎస్, గుంటూరు**

**ఉద్యోగంచేసే ఆడవారిని చులకనగా చూసా రెందుకు ?**

ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు వల్ల.

**డి. జి ఎమ్, ఖర్గపూర్**

**పైవారు మనమాట వినేలా చేయాలంటే ఏం చేయాలి?**

ఎదుటివారిని మనవైపు మళ్లించుకోవడం చేతలతో కాదు చెవులతో వారేం చెప్తున్నారో వినడం అలవాటు చేసుకుంటే—వారే మనమాట వినడం ప్రారంభిస్తారు.

**ఎమ్. ఎమ్ ఆర్, విజయవాడ**

**విజయవంతమైన తమిళ చలన చిత్రాలని మక్కీకి మక్కీ, కాపీకొడుతూ —మన తెలుగు నిర్మాతలు పబ్లిసిటీలో వాటిపేరేనా చెప్పకపోడం కారణం: ఎందుకిలాచేస్తారు?**

తెలుగుసినిమా సక్సెస్ అయితే—స్వంతం అని చెలామణీ అయిపోతుందని!! సినిమాల విషయంలో జనం పుట్టి గొర్రెలమంద అనీను!

# మేము చూసిన అమెరికా

## గుమ్మడి, వాణిశ్రీల అభిప్రాయాలు!

విదేశ పర్యటనను విజయవంతంగా కొనసాగించి వచ్చిన కుమారి వాణిశ్రీ, శ్రీయుతులు గుమ్మడి నాగభూషణం, రాజబాబు, ఆర్. యస్. రాజు, శ్రీమతి కాంతమ్మారాజు 'తాము చూచిన అమెరికా' గూర్చి పత్రికేయులతో ముచ్చటించడానికిగాను జూన్ 23 వ తేదీ సాయంత్రం న్యూవుడ్‌లాండ్స్ హోటలులో గోష్ఠి నొకదాన్ని ఏర్పాటు చేశారు.

అందరూ కలిసి వెళ్ళారు, కలిసితిరిగారు, కాబట్టి అందరి తరఫున గుమ్మడి వెంకటేశ్వరరావు, కుమారి వాణిశ్రీ, తమ అనుభవాలను తెలియపరచారు.

గుమ్మడి మాట్లాడుతూ 'మే 9 వ తేదీ బయలుదేరిన మేము 10 వ తేదీ సాయంత్రం న్యూయార్కు చేరుకొని, 11 వ తేదీ చూడవలసిన ముఖ్య ప్రదేశాలను కొన్నింటిని చూచి ఆనందించాము. 12 వ తేదీ చిత్రోత్సవం ప్రారంభమైంది న్యూయార్కులో. అమెరికాలో తెలుగు వారి జనాభా పదినుంచి పదిహేనువేలదాకా వుండడం అటుంచి, వారిలో మూడొంతుల భాగం న్యూయార్కులోనే వుండడం, వారందరూ ఈ చిత్రోత్సవంలో పాల్గొనడం మాకు మహదానందకరమైంది మన తెలుగువారితోబాటు కొద్దిమంది అమెరికన్లు, తమిళులు, కన్నడిగులు వచ్చి చిత్రోత్సవాన్ని నేత్రపర్వం చేశారు.

ఆరంభంలో అన్ని చిత్రాలు అనుకొన్న విధంగా రాకపోవడంతో, మొదటిరోజు మాత్రం 'దసరాబుల్లోడు' చిత్రాన్ని, మరునాటి రోజున మిగిలిన చిత్రాలను (బుల్లెమ్మ-బుల్లోడు, తాత—మనవడు, మరపురాని తల్లి) ప్రదర్శించడం జరిగింది. వాషింగ్‌టన్ హాండ్స్‌వెల్, హ్యూస్టన్, లాస్ ఏంజెలిస్, చికాగో, బఫెలోలలో పై చిత్రాల ప్రదర్శనలు జరిగాయి,

హాలీవుడ్ నటీనటులను చూద్దామని వుబలాట పడ్డాంగాని వారందరూ యూరప్ వెళ్లి యుండడం మా ఆశకు అంతరాయం కల్గించింది. హాలీవుడ్‌లోని 'యూనివర్సల్ స్టుడియో'ను చూడడం జరిగింది. భారీ విస్తృత సకల సౌకర్యాలతో నిర్మింపబడింది ఆ స్టుడియో. 38 సౌండ్ స్టేజీలతో, 420 ఎకరాలలో బ్రహ్మాండంగా అమరింది ఆ స్టుడియో నిర్మాణం. సన్నివేశాలు, సందర్భాలను అనుసరించి సెట్సు వేసుకోవడానికి నూతన విధానాలు ఏర్పాటు చేయబడి ఉన్నాయి. అప్పటికప్పుడు అవి అనుకోకుండా కొన్ని బంగళాలను, రకరకాలుగా నిర్మించి యున్నారు. ప్రళయం లాంటి భయానక దృశ్యం కావాలంటే అక్కడున్న 'రిమోట్ కంట్రోల్' స్విచ్ నొక్కితే చాలు.

విశ్వవిఖ్యాతి గాంచిన 'డిస్నీలాండ్', ఫాంటాసీ, అండర్సీలాండ్, ప్రిమిటివ్ లాండ్, హ్యూస్టన్‌లో 'స్పేస్ సెంటర్' మున్నగు ప్రదేశాలను తనివితీర చూచాము. 'స్పేస్‌సెంటర్'లో 'స్కైలాబ్' లోకి వెళ్లబొయ్యే వారుండి వప్పటికీ. వారికి రిహార్సల్సు వున్నందున. వార్ని చూచే అవకాశం కల్గలేదు.



వాణిశ్రీ

అమెరికా మాజీ ఉపాధ్యక్షుడు శ్రీ హ్యూబర్ట్ హంఫ్రీని, శ్రీ రోబర్ట్ కెన్నడీని కలుసుకోగలిగాము, సెనేట్ కార్యక్రమాలను దగ్గరుండి నిశితంగా పరిశీలించాము.

అమెరికాలోని జనుల జీవనం ఆర్థికంగా మెరుగ్గావున్నా, నైతికంగా పతనావస్థలో వుందనే చెప్పొచ్చు. పాపులేషన్ సమస్య లేకపోయినా. పొల్యూషన్ సమస్యను ఎదుర్కొంటుంది ఆదేశం. కార్ల వల్ల పొల్యూషన్ అధికంగావుంది.

అమెరికా దేశంలోని మన దేశీయులు వుమ్మడి కుటుంబాలని చూచి మనకది ఎలా సాధ్యమౌతున్నదో వారికి అర్థం కావడం లేదని తమ సందేహాన్ని వ్యక్తపరచారు.



గుమ్మడి వేంకటేశ్వరావు

( చిత్రకారుడు : శ్రీ నవీన్‌కుమార్ )

# '...కొద్దిరోజుల్లో తిరుగుబాటు జరుగుతుంది'

'ఇప్పటి డిగ్రీ చదువులన్నీ ఉపయోగం లేనివి. స్వతంత్రంగా జీవించడానికి ఉపాధి కల్పించే చదువులుంటే ఇంత నిరుద్యోగం వుండివుండేది కాదు—' అంటాడు ఆరాధ్యుల శ్రీనివాసమూర్తి. కడప ఆర్ట్సు కాలేజీలో బిఎస్సీ చదివాడు.

అధికారం వుంటేనే ఏపనయినా సక్రమంగా చెయ్యడానికి వీలవుతుంది, నాకు డెవలెప్‌మెంట్ అంటే ఇష్టం. మా ప్రాంతాన్ని పారిశ్రామికంగా అభివృద్ధి చెయ్యాలని నా తపన. అందుకే ఐయ్యేయస్‌కి వెళ్తున్నాను. అధికారం చేతిలోకి వచ్చాక నా లక్ష్యాన్ని నెరవేర్చుకోడానికి ప్రయత్నం చేస్తాను...పారిశ్రామికంగా, అభివృద్ధి చెందితేనే దేశం సుభిక్షంగా వుంటుంది'—

## క్విక్ ఇంటర్వ్యూ

అంటూ పెద్ద పెద్ద సినిమా డైలాగులతో మాట్లాడాడు.

సినిమాలు మామూలుగా చూస్తుండేవాడట. ఈమధ్య చూచిన సినిమాల్లో 'ధనమా దైవమా,' నచ్చిందట.

ఏవిన్నార్ డిస్ట్రిబ్యూటర్ అంటే అభిమానం. వీరి చిత్రాలు విడవకుండా చూస్తాడు. మిగతావి బాగున్నాయని విన్నా, చెబితే చూస్తాడు. హీరోయిన్స్‌లో వాణిశ్రీ అంటే అభిమానం.

హిందీలో రాజేష్‌ఖన్నా, హేమమాలిని ఇష్టం.

కాలేజీలో అమ్మాయిల శాతం సగం వరకు వుండటట. అమ్మాయిలతో 'లోకం విషయాల' గురించి మాట్లాడతాడట. అమ్మాయిలతో కావాలని లోకం విషయాలు గురించి మాట్లాడడు. ప్రస్తావన వచ్చినప్పుడే మాట్లాడతాడు!

కో-ఎడ్యుకేషన్ వుంటే ఒకరినొకరు అర్థం చేసుకోడానికి వీలవుతుంది. అంతా 'హుషారుగా చదువుతారు' అన్నాడు.

రాజకీయాలు అంటే ప్రత్యేకించి ఇష్టంలేదు. కాని ప్రత్యేక రాష్ట్ర వాదులమీద సానుభూతి వుంది.

'మనకి సమర్థంగా నిర్వహించే నాయకులు లేరు. ఇలా కొంతకాలం జరిగితే తిరుగుబాటు జరుగుతుంది'



ఆరాధ్యుల శ్రీనివాసమూర్తి

అన్నాడు ఎందుకూ? అంటే ధరలు విపరీతంగా పెరిగిపోతున్నాయి రానురాను ఇబ్బందులు ఎక్కువయి పోతున్నాయి అని సమాధాన మిచ్చాడు.

ఇంతా చెప్పి రూలింగ్ కాంగ్రెస్ విధానాన్ని సమర్థిస్తాను అన్నాడు. వ్యక్తిగతంగా ఇందిరాగాంధీని ఆరాధిస్తాను అన్నాడు.

ఒక ఇండస్ట్రీ పెట్టి జీవితంలో స్థిరపడి పెళ్ళి చేసుకుంటాను— అన్నాడు శ్రీనివాసమూర్తి.

—సికరాజు.

# మేము చూసిన...

వారి సాంఘిక జీవనం మన మనుకునేంత సుఖమయంగా లేదు. ముసలివారి జీవితం చాలా దయనీయంగా వుంటుంది. వారికి దేశంలో మనశ్శాంతి లోటు కన్పడుతోంది. అందుకే 'హరేరామ, హరేకృష్ణ' నామాన్ని నిత్యము జపిస్తుండేవాళ్ళని మా కళ్ళారా చూచాము

మనదేశంలో తయారయ్యే పౌరాణిక చిత్రాలను విదేశాలకి పంపితే, వాటికి మంచి ఆదరం. అభిమానం లభిస్తాయని ద్యోతకమౌతుంది. ఈ పథకాన్ని సక్రమంగా నెరవేర్చడానికి తోటివారందరితో సంప్రదింపులు జరపడానికి నిశ్చయించాము' అన్నారు గుమ్మడి.

అభినేత్రి వాణిశ్రీ అమెరికాలో తాను చూచిన వింతలను, విశేషాలను ఇలా చెప్పింది. 'భారతీయ చిత్రాల్లోని ఒకశాఖ అయిన మన తెలుగు చిత్రాలకు ఆ దేశంలో గిరాకీ వుంటుందని వూహించాము. కాని వూహ తారుమారు అయింది. అందుకు కారణాలు ఏమిటని ఆలోచిస్తే, రెండే రెండు కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి. ఒకటి మన చిత్రాలకు సబ్‌టైటిల్సులేవు. రెండు మన చిత్రాల నిడివి ఎక్కువ. సబ్‌టైటిల్సు తగ్గించి చిత్రాల నిడివి 10—12వేల అడుగులు చేస్తే మార్కెట్ రావచ్చు అని ఒక ఆశ. కానీ అది సాధ్యం కాని పని. అమెరికనులకు వారంలో ఒక్కరోజు మాత్రమే తీరుబడి. అందులోను మూడు, నాల్గు గంటలసేపు కూర్చొని వారు చిత్రాలను చూడలేరు. చిత్రాలను ఇక్కడిలా థియేటర్లలో ప్రదర్శించే అవకాశం వుండదు. ప్రయివేటు ఆడిటోరియంలో మాత్రమే ఆ పని జరుగుతుంది.

అమెరికన్లు వేసిన వింత ప్రశ్నలను ఇలా చెప్పింది. నేను ధరించుకెళ్ళిన నగలను చూచి మీ దేశంలో గూడా బంగారం వుందా? అని ఆశ్చర్యంగా ప్రశ్నించారు. మన దేశంలో వున్నవారందరూ లేమితో బాధపడేవారని వారి వుద్దేశ్యం. వారికి ఐశ్వర్యం వున్నా మనశ్శాంతి వుండదు. మమతానురాగాలకు దగ్గర బంధువులు కాలేరు.

(64వ పేజీ చూడండి)




# డబ్బుచుట్టు తిరుగుతోంది భూగోళం

యడవల్లి సుజాత

నాలుగురోడ్ల కూడలి.
అక్కడో అంగడి.
దానిప్రక్కనే ఓ చెట్టు
దానిక్రింద ఓ బల్ల—
దానిపై మూర్తి

ఏవో కొన్ని సందర్భాల్లో— తప్ప, ఎప్పుడు ఎవరు అటుచూసినా—

ఆ కొట్టుకో అవసరమైన వస్తువులు ఉన్నా లేకపోయినా—

కొత్త డిజైన్ క్రాంగాళ్ళ ఫ్యాషన్ డ్రెస్‌తో' 73 స్టయిల్ క్రాఫ్‌తో, పెదాల మధ్య సిగరెట్ కాలుతూంటే చేత స్టేట్ ఎక్స్‌ప్రెస్ టిన్ ఉంచుకుని అన్వేషించే కళ్లతో కూర్చొనున్న మూర్తి మాత్రం తప్పక కన్పిస్తాడు!!

# డబ్బు చుట్టూ...

అంతేగాదు అతని చుట్టూ అంగరక్షకుల వలె మిత్రబృందం! అతనికి జే కొడుతూ కోకా కోలా టీ సిగరెట్ గట్రా త్రాగేస్తుంటారు!!

ఆ జే జేల శబ్దం వెల్వడిన ప్రతి సందర్భంలోనూ అతని జేబులోని కరెన్సీ ఖర్చవుతూంటుంది.

మూర్తికి చెందిన కళ్ల అన్వేషణ ఆగినచోట పరికిస్తే— ఓ అందమైన కళ్ల జత కన్పిస్తుంది! అవును.

అంతేగాదు సదరు ఆ అందమైన కళ్లు మూర్తివైపే ఎక్కుపెట్టబడున్నా యన్న విషయం గూడా వచ్చినిజం.

ఆ అందమైన సోగకళ్లు.

ఓ కన్నెపడుచువి.

ఆ అందాల బొమ్మ ఆ మేడ వరండాలో ఇటీవల అదే పనిగా నిలబడుతూ ఉంటం మరీ పచ్చినిజం.

ఆ అందమైన పడుచుకి యవ్వనం మరీ అందాన్ని పెంచేస్తున్నది. ఆ కనుల లోని నిరీక్షణ మరీ మరీ ఆకర్షణని పెంచేస్తున్నది. ఆ నిరీక్షణవలన అలా నిలబడ్డంవలన చూస్తూండటం వలన— అగాధంలో దాగోనున్న ఆ హృదయంలో గిలిగింతలు.

అవి రోజా కలలు తెప్పించసాగాయి.

ఆ కలలో దివ్వో మేడలు!

రాత్రిళ్లు చాలక పగలూ అవి రంగు రంగులుగా ముసురుకోసాగాయి.

ఇక కలలేనా మిగిలేది ప్రియతమా అంటూ విరహగీతాలాపన కనులద్వారా ప్రసారం.

మూర్తి అనబడే వ్యక్తి కళ్లజత దాన్ని రిసీవ్ చేసుకుని బదులు సందేశం పంప తూండగా

ఆ రెండూ మార్గమధ్యంలో కల్సుకుని గగన మండలంలోకి ఎగసి విహరిస్తూ— ప్రేమచుట్టూ తిరుగుతూంది భూగోళం

తిరిగింది తిరుగుతున్నది తిరగాలెను

అవును నిజం కమ్మదనం

అన్న భావగీతాలు మూగగా పాడుకుంటూ—

'నే చూస్తున్నా గుండె మధ్య చాలా పాలిష్ తేలాడు. పేదోళ్ల బాధల్ని బోర్ దిన్పించటంలేదు, ప్రదాని పోష లిషన్ని మెచ్చేసుకొంటున్నాడు— కదేంటి గురూ పర్మిట్ లైసెన్ లాంటివి కొట్టేసినవా?!'

గురుపీఠంపైని మూర్తి చిత్రమైన చిర్నవ్వు విసరాడు. దాని అర్థం తెలియక తలగోక్కుంటున్న ఆ బృందంలోని ఓ రోమియోకి రోజా ఆదారిన వెళుతూన్న ఓ విద్యార్థిని కన్పించింది.

'అదుగో ఆ బ్యూటీయే గురూ నేను చెప్పింది. ఇక మళ్లీ ఉరున్నరకుగాని ట్యూషన్నుండి తిరిగిరాదు. నే చెప్పే దేంటంటే రహస్యం నిడండి దగ్గరకు రండి, కమాన్ మనం ఆ బ్రిడ్జివద్ద ఉన్నామంటే ప్రభుత్వంవారి పుణ్యమని వీధి లైట్లు లేవు చీకటి గాడాంధకారం. అరచినా వెతరెవరూ వెదకినా కన్పించం పసరం.'

'మిస్టర్ రోమియో అలా టీజింగులు సభ్యతకాదు మంచిదీ కాదు. అసలు ఆడాళ్ల వెంక తిరగటం కూడా ఆరోగ్యకరం కాదు' అన్నాడు మూర్తి. అన్ని మాటలకూ కాదుగాని ఆ చివరిమాటకు అక్షరాలా ఆ చివరిమాటలకే — ఇందిరాగాంధి ప్రత్యేక రాష్ట్రం ఇస్తున్నాను ప్రజలారా అంటే కలిగినంత ఆశ్చర్యం కలిగింది.

అందుమీదట ఒకరొకరు చూసుకున్నారు. వాళ్లకు సమాధానం లభించక పోయేసరికి జుట్టు పీక్కున్నారు. అతనో మిస్టరీ అయ్యాడు.

'మెదడు నరాలు చిట్లిపోతున్నట్లు భయం భయంగా ఉందిరోయ్.'

అని అరిచేశాడు.

ప్రక్కనే ఉన్న మరొకతను—

'నాయర్ అరు స్ట్రాంగ్ టీ' అన్నాడు.

కావున జేబులు తడుముకోవాల్సిన అవసరం కల్గింది మూర్తికి ప్రత్యేకంగా.

చిల్లర తగలటంలేదు. తను ఇవ్వకపోతే పద్ధతికి భంగం కలిగితే గురి నశిస్తే పరపతి క్షీణిస్తే.

మేడమేడపైని అందమైన అర్లీ బిల్లీగా తిరక్కుండా నిశ్చలంగా తనని తన కేసి ఆశగా పరిశీలనగా చూస్తున్న కళ్లు వాటి తాలుకు అందం, అందం తాలుకు ఆకారం.

చివరికి తగిలిందో నోటు.

సగర్వంగా పైకి తీశాడు.

ఆ బృందం బ్యూటీ వస్తున్నట్లు హెచ్చరించింది ముందుగ వచ్చిన చీకటి. వాళ్లంతా బయలుదేరారు.

మిగిలిన మూర్తికి వేడపైని అందం కన్పించలేద.

ఏమాయెనా? అనుకుంటూ చింతించ బోతూన్న తరుణంలో చేతిలో పూల పెళ్లెతో కన్పించి ఊరట కల్గించింది.

అంతేకాదు రోడ్డు మలుపుతిరుగుతూ తోడు రమ్మని సైగచేసినట్లు భావించాడు మూర్తి.

అందమైన పడుచు ఖరీదైన పడుచు తనని వరించిన పడుచు తనకై నిరీక్షిస్తున్న పడచు అందం — పోషణ జం వర్ధిల్లాలి.

నైస్‌గా క్రాఫ్ సర్దుకున్నాడు మూర్తి. పైకి లేచాడు.

గుడి బయట వెంచేసియున్న కొబ్బరి కాయలు అరటిపళ్లు పూలు తదితర వ్యాపారస్థులు దైవానుగ్రహం కొరకు ఫల పుష్పాదులను తీసికెళ్లండని ఉద్బోధిస్తున్నారు.

భక్తులు తర్కించుకుంటున్నారు ఎంతెంత ఖర్చుపెడితే ఎన్ని కొబ్బరికాయలు కొడితే దేముడు దగ్గరవుతాడు? కోరింది. నెరవేరుస్తాడు?

'ధర్మం చెయ్‌బాబూ ఎంత చేస్తే అంతకు కొన్నింతలుగా దేవుడు మీకు కల్గిస్తాడు'— అంటున్నారు ముష్టివాళ్లు రూపంలోని ఈ వ్యవస్థ ప్రతిఫలాలు.

లోన ఆఫీస్ ముంగిట నోటీస్‌బోర్డులో

కుంకుమపూజ యాభై పైసలు— కర్పూరహారతి నలభై పైసలు—అద్దాల మహలు దర్శనం ముప్ఫై పైసలు— కొబ్బరికాయ ఇరవై పైసలు దద్ధోజనం ఇరవైఐదు – పులిహోర ముప్ఫై—చక్కెర పొంగలి నలభై — వడ యాభై—లడ్డు ఒక్కరూపాయి.

గర్భగుడిలోని పూజారి

అధిక మొత్తాలలో కానుకలు తెచ్చిన వారివంకే చూస్తున్నాడు ఖరీదుగా ఉన్న వారివే వెక్కరిస్తున్నాడు.

తాంబాళంలో పడుతున్న దక్షిణలను మురుగ్గా చూస్తున్నాయి పూజారిగారి కళ్ళు. పెద్ద నాణాలు విలువైనవి పడుతూంటే కళ్లు మెరుస్తున్నాయి. అలాటివారికి మరి కొన్ని తీర్థం మరికొన్నిసార్లు శఠగోపం మళ్లీ మళ్లీ ఆశీర్వాద మంత్రోచ్చారణ

ఇలాగే నిలబడితే ఆలస్యమవుద్ది అవకాశం జారిపోతుంది. పమయం మించిపోతే బజార్లో అంగళ్లూ ఉండవు డాక్టర్లూ ఉండరు.

అటునుంచి అటే విసరేసింది పూలను.

ఇటు చూసింది—మూర్తి.

నవ్వింది. అతను నవ్వాడు.

ఆమె నడచింది. అతనూ నడిచాడు.

గుడినుండి రోడ్డుకి, రోడ్డువెంబడి నదికి.

నది ఒడ్డుని ఇసుకలో ఒకచోట—పొడి పొడిగా ఉన్నచోట తడి కోరికలతో ఉన్న ఆ ఇద్దరూ కూర్చున్నారు.

దూరాన నీటిలో బండపైని గుడ్డల మోత వంతెనపై రిపేర్ చేస్తున్న కార్మికుల సమ్మెటదెబ్బలు.

'ఏమి కోరారు భగవంతుడిని?'

ఆసక్తిగా అడిగింది ఆ అందం.

'మీచుట్టూ తిరుగుతూన్న నా మన స్సులో భగవంతుడికి స్థానమేది? మీరో?'

'మిమ్మల్నే నాకు శాశ్వతం చెయ్యమని'

ఆమాట అనేందుకు సంకోచించలేదామె.

పెద్ద బరువుతో పోల్చినప్పుడు చిన్న బరువు తేలికవుద్దేమో!

రెండబద్ధాలు ఢీకొంటే నిజం ఆవిష్కరింపబడుతుందా? దీనికి సమాధానం శాస్త్రవేత్తల లాబ్‌లోనా మేధావుల ప్రవచనాల్లోనా?

ఆవిడ చెవుల్లోని జూంకెల బంగారా రంగు తళుక్కున మెరుస్తున్నది. చేతుల గాజులు వాటిపైని రాళ్ళు, వేలివుంగరం, మెడలోని దండ ఆసక్తిగా స్పృశించాడు వాటిని. 'చాలా బాగున్నాయి!' అన్నాడు గూడను.

ఏం బాగులే అన్నట్లు నవ్వింది.

'చాలా బాగున్నాయి అందంగాను ఖరీదుగాను'

'ఏంటో నాకు చాలా భారంగా ఉన్నాయి. అమ్మేమో సేఫ్‌లో ఉన్నవన్నీ అలంకరించుకోమంటుంది. నాకు సింపుల్‌గా ఉండాలంటే యిష్టం!'

'మీ సంపదంతా బంగారంలోకి మార్చేశారా ఏంటి?!' పరిశోధనాత్మకంగా అడిగాడు పొదా పోజు పెడుతూ.

ఈ నగలపై లోతు చర్చ ఆ కన్నె పడుచు కంత యిష్టంగాలేదు.

'ఎప్పుడూ అక్కడే ఉంటారు ఆ షాపు మీదా?'

'ఛీ ఛీ ఇలాటివి ఓ యాభై కలిసినా నా లెవెల్‌కి అంతస్తుకి సరిపోవు. మీకోసం మిమ్మల్ని చూస్తూ గడపాల్సని కబుర్లాడాలని'

'నన్నుక్కిరి బిక్కిరి చేయకండి బాబూ! యుగయుగాలుగా ఎన్నో జన్మలుగా మన బంధం కొనసాగినట్లు ఆ



ప్రతీకమీ వీక్షణంలో తెలిసింది!! నన్ను పులకరింపజేసింది నా తపస్సు ఫలించింది —మీకోసం నేను నాకోసం మీరు.'

నిజంగా! నిజంగానా!! తనని అంత గాఢంగా ప్రేమిస్తున్నదా? పరీక్షిస్తున్నదా! తను విజయం పొందాడు. తను అదృష్టవంతుడే.

ఇంత నిజంగా తనని ప్రేమిస్తున్న అతన్ని తను మనస్ఫూర్తిగా త్రికరణ శుద్ధిగా ప్రేమిస్తున్నదా? తను చెప్పిందంతా నిజమేనా? తను అబద్ధాన్ని దాచేస్తున్నది. నిజం చెప్పేస్తే? వూహూఁ చెప్పలేదు. చెప్పేందుకు లేదు చెప్పి కలల్ని భగ్నం చేసుకోలేదు. తన పూజలు ఫలించబోతూంటే తను అజ్ఞానం ప్రదర్శించటమా! ఏమైనా సరే ఈ అవకాశాన్ని జారవిడువకూడదు.

అలాగే చాలాసేపు తర్కించుకుంటూ ఒకర్నొకరు చూసుకుంటూ గడిపారు.

సైరన్ మ్రోగింది విరామదయిందని హెచ్చరించింది.

డక్టరు పేకాట కెళ్ళిపోతాడు మందుల షాపులు మూసేస్తారు. తల్లి జబ్బు — జబ్బుతో తల్లి — సంవత్సరాలుగా తల్లితో స్నేహం చేస్తున్న దీర్ఘరోగం — రోగాన్ని పెంచేస్తున్న దారిద్ర్యం. మేడనీడ ఓ పెద్ద చీకటి. ఆ నీడలో గుడిసె ఓ చీకటిలాంటి నిజం! మళ్ళీ ఆ గుడిసెలో కటికచీకటి ఆ చీకటిలో కుక్కి మంచం — మంచంపై తల్లి.

తల్లిచుట్టూ చీకటి.

తల్లి లోపల రోగం.

రోగం కోరుతున్న మందులు.

మందులు కోరుతున్న డబ్బు.

డబ్బులేని తన కుటుంబం.

న్యాయమైన సంపాదనా మార్గాలు చూపని ఈ వ్యవస్థ.

ఏమీ చేయలేని తన అశక్తత.

పైకి లేవాలిద్దరూ.

నడవకూడదని నడుస్తున్నారు దూరం తగ్గకూడదని నడుస్తున్నారు. గడువు దగ్గరపడుతున్నదని త్వరగా నడుస్తున్నారు ఇద్దరు ప్లస్ రెండూ నాలుగు మనుష్యులుగా నడుస్తున్నారు.

## డబ్బు చుట్టూ...

ఇల్లు దగ్గరపడుతున్నది. చేరగానే చీరె పోతాము, ఒంటరిగా యింటికెళ్ళాలి. ఉత్తి చేతులతో వెళ్ళాలి. అవకాశం పోగొట్టుకుని వెళ్ళాలి. మూర్తి కళ్ళు ఆబగా చూస్తున్నాయి. లొట్టవేసుకుంటున్నాడు. జుంకీలు, ఉంగరం గాజులు హారం హారం గాజులు ఉంగరం జుంకీలు ఉంగరం హారం జుంకీలు గాజులు గాజులు గాజులు ఉంగరం గాజులు ఉంగరం గాజులు జుంకీలు జుంకీలు ఉంగరం హారం హారం గాజులు ఉంగరం బంగారం బంగారం మార్వాడీ డబ్బు అప్పు పరువు చాలెంజ్ ఏమైనా అనుకుంటుందేమో? మల్లీనగా — బాధపడుతుందేమో? తనని మోసగాడని భావిస్తుందేమో? తనది బూటకం అని భీకొడితే?

ఇంకా సేపటిలో తప్పనిసరిగా వేరుకావాలి. వివరైనా చూడొచ్చు నిలిచాడు నిలిచింది— ఇద్దరూ ఒకేసారి!

ఊపిరి తిప్పుకోనివ్వని ఆలోచనలు.

అడగాల్నా? వద్దా?

సంశయం సంకోచం అవసరం పరువు ప్రతిష్ఠ మాతృప్రేమ సంఘభయం అనివార్యం.

'మీవద్ద ఓవంద ఉంటే సర్దండి అర్జంట్‌గా ఓ స్నేహితురాలికి ఇవ్వాలి, ప్రామిస్ చేశాను. ఈరోజు బ్యాంక్ లేదు రేపు డ్రాచేసి ఇచ్చేస్తాను' అని అనగలిగింది. చాలా నేర్పుగా అనగలిగానని తృప్తిపడింది.

సంవత్సరాలు తనని వండడిగింది? ఈరోజు బ్యాంక్ లేదు!

అతని పథకం నప్పింది. సామానుకుల బాకీ నిన్నిమిదికల్లా చెల్లించేయాలి లేకుంటే సరుకిచ్చేదిలేదు మరొకర్నిన్వనిచ్చేది లేదు అన్నశెట్టి— ఆ నెల అద్దె ఇవ్వని పక్షాన బయటికి గెంటేస్తానని బెదిరించిన యింటి ఓనర్. తన ప్లాను ఆ ప్లాన్‌కి పెటిన ఖర్చు అంతా కూడబలుక్కుని శక్తివంతంగా వికటాట్టహాసం చేస్తూంటే...

అసిడ గిల్టు నగలు జాలిగా చూస్తున్నాయి.

భూగోళం తిరుగుతూ ఉన్నది! ●

## ఒకవారం విశేషం

(11వ పేజీ తరువాయి)

### బల్లలు తుడిచే బాలుడి అదృష్టం

సినిమా షూటింగు కోసం వూటీ వెళ్ళి హోటల్లో బస చేసిన నటుడు శశికపూర్ ఆ హోటలులో బల్లలు తుడిచే పని చేస్తున్న 11 ఏళ్ళ బాల సుబ్రహ్మణ్యం అనే కుర్రాడిని చూసి, ముచ్చటపడి, అతడిని పెంచుకుంటానని ఆ కుర్రాడి తలిదండ్రులకు చెప్పి, వారికి కొంత డబ్బుయిచ్చి, అతన్ని తన వాడిని చేసుకుని మద్రాసుకు తీసుకొనివచ్చి బోర్డింగ్ స్కూలు కాన్వెంటులో జేర్పాడట— అదృష్టమంటే యిదే కదా!

### కుటుంబ నియంత్రణ-భయాలు

కుటుంబ నియంత్రణ పథకంలో అత్యధిక భయ, శ్రద్ధాభక్తులు చూపి, దీనిని అమలుపరచడం వల్ల రాను రాను కొన్నికులాలు క్షీణించి, తుదకు నశించిపోతాయని, దీనివల్ల రాను రానూ హిందూమతమే పల్చబడి పోవచ్చుననీ కొందరు మేధావులు భయపడుతున్నారు— కానీ, యీ విషయం కోసం, భయపడే, జనాభాను పెంచితే దేశం విషయం ఏంగాను అని కేంద్ర ఆరోగ్య, కుటుంబ నియంత్రణ శాఖ సహాయమంత్రి ఖాదిల్‌కర్ అన్నారట. ●

## వేమము చూసిన ...

(60వ పేజీ తరువాయి)

మన చిత్రాలన్నీ ఏదో ఒక ప్రయోజనాన్ని మాత్రమే సూచిస్తూ నిర్మింపబడుతుంటాయని, జాతి వున్నతి, దృక్పధాలకు సంబంధించినవిగా రూపొందింపబడడంలేదని వారి అభిప్రాయం.

తెలుగువారి జ్ఞాపకార్థంగా గాజులు, వెండి బరిణెలు, పట్టుశాలువలు నా కానుకలుగా తీసుకెళ్ళి అమెరికన్లకు ఇచ్చాను' అంది తారాపథంలో వుజ్జ్వలంగా వెలుగొందుకొన్న వాణిశ్రీ.

రాజబాబుగార్ని మీ అభిప్రాయాలేమిటని ప్రశ్నించగా, 'తను చెప్పదలంచుకొన్నది, చెప్పవలసింది అంతా తన సాటి కళాకారులు, తోటి యాత్రికులు చెప్పేశారు' అని నవ్వుతూ బదులిచ్చారు.

—శ్రీనివాస్ ●

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 9, Thambu Chetty Street, Madras-1 and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3.
Editor : S. Radhakrishna.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

స్వచ్ఛమైన స్నేహానికి ఉదాత్తమైన రూపకల్పనే.....




బి. అచ్యుతరామరాజు సమర్పించు
శ్రీ వాణీ కంబైన్స్ వారి



# స్నేహబంధం

నిర్మాత
యస్.వి.సుబ్బరాజు

దర్శకత్వం
పి.చంద్రశేఖరరెడ్డి B.A

మాటలు
దాసరినారాయణరావు

పాటలు ఆత్రేయ
సంగీతం సత్యం
కెమెరా: వి.వి.ఆర్. చౌదరి

అన్నపూర్ణా ఫిలింస్ లిఁ.

ANNAPURNA